—: సవరణ :—

కడచిన మేనెల సంచికయందలి 'హిందూసంఘసంస్కరణము' అను వ్యాసములోని 9 మొదలు 16 వఱకుఁ గల పుటలు పొరబాటున విడిచిపెట్టఁబడినందున నవి యీసంచికయందుఁ జేర్పఁబడినవి.

కీర్తిశేషులైన శ్రీ కంగుల శ్రీమన్నారాయణగారిచే స్థాపింపఁబడియె.

సంపుటము. III ‖ జూలై. 1913. ‖ సంచిక. 3

# మానవసేవ.

మత సంఘ పరిశ్రమ భాషావిషయములఁ జర్చించు

## సచిత్ర మాసపత్రిక

రాజమహేంద్రవరము

పత్రికాసంపాదకులు

నాళము కృష్ణారావు

సత్యవోలు అప్పారావు.

సత్యవోలు అప్పారావుచే

శ్రీవిద్యానిలయ ముద్రాశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

రాజమహేంద్రవరము.

1913.

# చందా వివరము

| | | |
|---|---|---|
| చందాదారులకు | వత్సరమునకు | రు 3 |
| అభిమానులకు | ,, | 5 |
| పోషకులకు | ,, | 10 |

రాజపోషకులయాదరణము వారియనుగ్రహాధీనము.

మాదిరిపత్రిక వలయువారు 4 అణాలపోష్టుబిళ్ళలఁ బంపవలయును.

# ప్రకటనపద్ధతి

| | పుటకు. | | | అరపుటకు |
|---|---|---|---|---|
| వత్సరమునకు | రు 30 | ... | ... | రు 18 |
| అర్ధవత్సరమునకు | 18 | ... | ... | 10 |
| మూడుమాసములకు | 10 | ... | ... | 6 |
| మాసమునకు | 3–8 | ... | ... | 2– 8 |

# రాజపోషకులు

1. శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు.
2. శ్రీరాజా నాయని వేంకటరంగారావుబహద్దరువారు. మునగాల.

# పోషకులు

1. శ్రీయుత శ్రీకొవ్వూరి చంద్రారెడ్డిగారు. జమీందారు, నిడదవోలు.
1. ,, శ్రీకలిదిండి వేంకటరామరాజుగారు ,, ,,
3. ,, తమ్మన మాణిక్యముగారు ఏలూరు.
4. ,, శ్రీమోతే గంగరాజుగారు. జమీందారు. ఏలూరు.
5. శ్రీరాజా కాళీపల్లి అచ్యుతరామయ్య బహద్దరువారు. దూదవోలు.
6. శ్రీరాజా కోటగిరి వేంకటకృష్ణారావు బహద్దరువారు. గంపలగూడెం

# అభిమానులు

1. శ్రీయుత అద్దేపల్లి లక్ష్మణస్వామిగారు. ఏలూరు.
2. ,, శ్రీఉయ్యూరు మైనరు జమీందారుగారు. చెన్నపురి.
3. ,, చుండూరు శ్రీరాములుగారు. ఏలూరు.
4. శ్రీరాజా వెలుగోటి ముద్దుకృష్ణయాచేంద్ర బహద్దరువారు. వేంకటగిరి.
5. శ్రీయుత డి. పానకాలరావుగారు. కోయంబత్తూరు.
6. ,, తోట రామచంద్రయ్యగారు. పూళ్ళ.
7. ,, వనమాలి జగన్నాథముగారు. రంగూను.
8. శ్రీరాజా బులుసు సర్వారాయుడు బహద్దరుగారు. కపిలేశ్వరపురము.

# విషయములు


| | | |
|---|---|---|
| 1 | భక్తసంజీవని | నాశము కృష్ణారావుగారు |
| 2 | ఆర్యసూక్తిముక్తావళి | సత్యవోలు అప్పారావుగారు |
| 3 | నీతిబోధ | ,, ,, |
| 4 | చాణక్యశతకము | కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు |
| 5 | మరణము | ,, ,, |
| 6 | కావ్యము | శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు |
| 7 | దుర్గావతి | గోటేటి జగన్నాథరావుగారు |
| 8 | ధర్మపుత్రుడు | కామరాజు హనుమంతరావుగారు |
| 9 | బ్రాహ్మమతోద్దేశము | వెలిదండ శ్రీనివాసరావుగారు |
| 10 | బ్రాహ్మసమాజచరిత్ర | పులవర్తి వేంకటసుబ్బారావుగారు |
| 11 | హిందూసంఘసంస్కరణము | M. వేంకటరంగయ్యగారు |
| 12 | ఆంధ్రరఘువంశవిమర్శనము | ఉమ్రే ఆలీషాకవిగారు |
| 13 | కిరసనాయిలు | అయ్యంకి వేంకటరమణయ్యగారు |


## చిత్రపటములు


దమయంతీస్వయంవరము

## వందనము.

క. శ్రీపంబులు ఖండితసం
తాపంబులు గల్మషాంధతమసమహోస్వ
ద్దీపంబులు పాషండదు
రాపంబులు విష్ణునందనాలాపంబుల్. 161

ఉ. ఆతత సేవఁ జేసెద సమస్తచరాచరభూతసృష్టివి
జ్ఞాతకు సర్వలోకజనసౌఖ్యవిధాతకు ధర్మమార్గని
ర్ణేతకుఁ బుణ్యయోగిజననేతకుఁ గల్మషజేతకున్ నత
త్రాతకు ధాతకుఙ్ నిఖిలతాపసలోకశుభప్రదాతకున్. 162

ఉ. దాతకు భక్తలోకవరధాతకుఁ బుణ్యజనానురాగసం
ధాతకు సర్వలోకహితదాతకు నిర్మలధర్మమార్గని
ర్ణేతకు నుల్లసద్విభవనేతకు సర్వజయజ్జయాంగజ
భ్రాతకుఁ బుణ్యయోగిజనభావవిధాతకు భక్తి మ్రొక్కెదఙ్. 163

ఉ. ఆదర మొప్ప మ్రొక్కెదను నాశ్రితలోకఘనానురాగసం
పాదికి దోషభేదికి ప్రపన్నవినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి సత్యవాదికి నశేషజగజ్జనవంద్యవేదికిఙ్
వేదపథాగమణీహృదయవీథివిహారలసత్ప్రమోదికిన్ 164

మ. ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచుపో
లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్నజా
న్యకదంబంబుల హృత్సరోరుహములఙ్ నానావిధానూనరూ
పకుఁడై యొప్పుచు నుండు నట్టిహరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై 165

మ. పరుఁడై యీశ్వరుఁడై మహామహిముఁడై ప్రాదుర్భవస్థానసం
హారణక్రీడనుఁడై త్రిశక్తియుతుఁడై యంతర్గతజ్యోతియై
వరయోగిప్రముఖాదిమానవులకుం బ్రాపింప రాకుండుదు
స్తరమార్గంబునఁ దేజరిల్లుహరికిం దత్త్వార్థినై మ్రొక్కెదఙ్. 166

ఉ. ఏవిభువందనార్చనము లేవిభుచింతననామకీర్తనం
బేవిభులీల లద్భుతము లెప్పుడు సంశ్రవణంబు సేయ దో
షావలిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగు నందు నే
నావిభు నాశ్రయించెద నఘౌఘనివృత్తిదు భద్రకీర్తిదున్. 167

ఉ. ఏపరమేశుపాదయుగ మెప్పుడుఁ గోరి భజించి నేర్పరుల్
లోపలబుద్ధిలో నుభయలోకములందులజడ్డుఁ బాసి యే
తాపము లేక నిశ్చలతఁ దారు గతశ్రము లై చరింతు రే
నాపరమేశు మ్రొక్కెద నఘౌఘనివృత్తిదు భద్రకీర్తిదున్ 168

చ. తపములఁ జేసి యైన మఱి దానము లెన్నియుఁ జేసి యైన నే
జపములఁ జేసి యైన ఫలసంచయ మెవ్వనిఁ జేర్చ కున్న హే
యపదము లై దురంతవిపదంచితరీతిగ నొప్పు చుండు న
య్యపరిమితున్ భజించెద నఘౌఘనివృత్తిదు భద్రకీర్తిదున్. 169

మ. యవనవ్యాధపుళిందహూణకశకంకాభీరచండాలసం
భవులుం దక్కినయొల్లమానవులు నేభద్రాత్ము సేవించి భా
గవతశ్రేష్ఠుల డాసి శుద్ధతను లై కల్యాణు లై యుందు రా
యవికారుం బ్రభవిష్ణు నాదుమదిలో నశ్రాంతమున్ మ్రొక్కెదన్. 170

మ. తపముల్ సేసిననో మనోనియతినో దానవ్రతావృత్తినో
జపమంత్రంబులనో శ్రుతిస్మృతులనో సద్భక్తినో యెట్లు ల
బ్ధపదుం డౌ నని తత్త్వవేత్త లెపుడున్ భావింతు రెవ్వాని న
య్యపవర్గాధిపుఁ డాత్మమూర్తి సులభుం డౌఁ గాక నా కెప్పుడున్ 171

మ. అణువో కాక కడున్ మహావిభవుఁడో యచ్ఛిన్నుఁడో ఛిన్నుఁడో
గుణుఁడో నిర్గుణుఁడో యటంచు విబుధుల్ గుంఠీభవత్తత్త్వమా
ర్గణు లై యేవిభుపాదపద్మభజనోత్కర్షంబులన్ దత్త్వవి
క్షణముం జేసెద రట్టివిష్ణుఁ బరమున్ సర్వాత్ము సేవించెదన్. 172

ఉ. మానఘనుల్ మహాత్ములు సమాధినిరూఢులుఁ యన్ముఖాంబుజ
ధ్యానమరందపానమున నాత్మ భయంబులఁ బాసి ముక్తు లై
లూనత నొంద రట్టిమునిలోకశిఖామణికిన్ విశంకటా
జ్ఞానతమోనభోమణికి సాధుజనాగ్రణి కేను మ్రొక్కెదన్. 173

మ. పరమాత్ముం డజుఁ డీజగంబుఁ బ్రతికల్పంబందుఁ గల్పించుఁ దాఁ
బరిరక్షించును దుంచు నట్టియనఘున్ బ్రహ్మాత్ము నిత్యున్ జగ
ద్భరితున్ గేవలు నద్వితీయుని విశుద్ధజ్ఞాను సర్వాత్ము నీ
శ్వరు నాద్యంతవిహీను నిర్గుణుని శశ్వన్మూర్తిఁ జింతించెదన్. 174

ఈ. పూని మనంబునుం దనువు భూతములున్ మఱి యింద్రియంబులుం
బ్రాణములున్ వివేకగతిఁ బాయక యన్యముఁ దమ్ము నెమ్మెయిం
గానఁగ నేర వాగుణనికాయములం బరికించునట్టిప
ర్వానుగతున్ సమస్తహితు నాదిమపూరుషు నాశ్రయించెదన్. 175

మ. ఘనలీలాగుణచాతురిన్ భువనముల్ గల్పించి రక్షించి భే
దనముం జేయుదురంతశక్తికి ననంతజ్యోతికిం బత్రివి
ర్యునికిన్ నిత్యపవిత్రికమ్మునికి నే నత్యంతతో నవ్యయా
త్మునికిన్ వందన మాచరించెదఁ గృపాముఖ్యప్రసాదార్థి నై 176

మ. ఘను లై యెవ్వనిపాదపంకజపరాగధ్యానసంప్రాప్తయో
గనిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి బం
ధనిరోధంబులు లేక విచ్చలవిడిన్ దర్పింతు రాదివ్యమూ
ర్తి నవాఙ్మానసగోచరున్ శుభకరున్ దేజోమయున్ గొల్చెదన్. 177

చ. అనఘులు నిర్జితేంద్రియులు నైనసనందనముఖ్యయోగు లెం
దనయము దీర్ఘకాలసముపార్జితయోగసమాధిఁ జేసి యె
వ్వనిచరణారవిందములు వారనిభక్తి నెఱుంగు చుందు రా
ఘనుఁ బరమేశు నీశు నవికారు నమేయు నజయ్యుఁ గొల్చెదన్. 178

చ. సుమహితనిత్యముక్తపరిశుద్ధవిబుద్ధసుతత్త్వుఁ డై యెఱుం
క్రియఁ దళిభూతసత్ప్రకృతికర్మకళంకుఁడు నైనయట్టియు
త్తమచరితుం గృపాకరు సదా గుణోన్నతు నీశ్వరేశుఁ జి
త్తమునఁ దలంతుఁ బుణ్యజనతాపరిరక్షణు దుష్టశిక్షణున్ 179

మ. బహుపాదోరుభుజాననేక్షణశిరఃఫాలశ్రవోయుక్తుఁ డై
విహరించున్ బహుదేహదేహగతుఁ డై విద్వాంసు లూహించి త
ద్బహురూపావయవంబులన్ భువనసంపత్తిన్ విచారింతు రా
మహనీయాద్భుతమూర్తి యోగిజనహృన్మాన్యున్ బ్రశంసించెదన్. 180

ఉ. ఏపరమేశ్వరున్ జగము లిన్నిటిఁ గప్పినమాయ గప్పఁగా
నోపక పారతంత్ర్యమున నుండు మహాత్మకుఁ డట్టివాని కు
ద్దీపితభద్రమూర్తికి సుధీజనరక్షణవర్తికిం దనూ
తాపము వాయ మ్రొక్కెద నుదారతపోధనచక్రవర్తికిన్. 181

ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దాన యైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్. 182

క. ఒకపరి జగములు వెలి నిడి
యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దానై
సకలార్థసాక్షి యగున
య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్ 183

క. లోకంబులు లోకేశులు
లోకస్థులుఁ దెగినఁ దుది నలోకం బగు పెం
జీకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్. 184

క. నర్తకునిభంగిఁ బెక్కగు
మూర్తులతో నెవ్వఁ డాడు మునులు విబుధులుం
గీర్తింప నేర రెవ్వని
వర్తన మొరు లెఱుఁగ రట్టివాని నుతింతున్ 185

ఆ. ముక్తసంగు లైనమునులు దిదృక్షులు
సర్వభూతహితులు సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు దిక్కు నాకు 186

క. యోగాగ్నిదగ్ధకర్ములు
యోగీశ్వరు లేమహాత్ము నొం డెఱుఁగక స
ద్యోగవిభాసితమనముల
బాగుగ వీక్షింతు రట్టిపరము భజింతున్. 187

ఆ. బ్రతుక వచ్చుఁ గాక బహుబంధనము లైన, వచ్చుఁ గాక లేమి వచ్చుఁ గాక
జీవధనము లైనఁ జెడుఁ గాక పడుఁ గాక, మాటఁ దిరుగలేరు మానధనులు 38

ఆ. మగువతనము మాని మగవాఁడు గా వచ్చుఁ, గాక పేరుఁ బెంపు గాసిగాఁగ
మగతనంబు మాని మగువ గా వచ్చునె, మానవంతుఁ డైనమానవునకు. 39

క. దురితముఁ దలఁపరు గానరు, జరుగుదు రెట్లైన నిముషసౌఖ్యంబులకై
పరవనితాసక్తులకును, పరధనగోప్తులకు నిహముఁ బరముం గలదే. 40

క. రాజ్యంబు పాపమూలము, రాజ్యముతో నొప్ప లెఱుంగ రాదు సుమతియున్
రాజ్యమునఁ బూజ్య నెఱుఁగఁడు, రాజ్యము గీజ్యమ్ము ముక్తిరతునకు నేలా. 41

క. సౌరాత్మ్యలమందిరములఁ, బౌరోహిత్యంబు కంటె పాపం బీసం
సారము కంటె శిలల్ దని, యూరక కాపోతవృత్తి నుండుట యొప్పన్. 42

క. అదలదు ప్రాణము లదలినఁ, గదలదు సర్వాంగకములుఁ గదలుచు నుండున్
వదలదు బిగువులు వదలినఁ, దుది లే దీతృష్ణ దీనిఁ ద్రుంపఁగ వలయున్. 43

ఆ. అక్క తల్లి చెల్లె లాత్మజ యొక్కట, పాను పెక్కఁ జనదు పడఁతి డాయఁ
బరమయోగి కైన బలిమిని నింద్రియ, గ్రామ మధికపీడఁ గలుగఁ జేయు. 44

క. వెంగలివి త్రాయి తిరుగుచుఁ, గంగారై చెడక ముక్తిఁ గాంక్షింతువతం
డంగనలతోడ విడువని, సంగడములు వదల వలయు సద్వర్తనుఁ డై. 45

క. ఎందును గాలము నిజ మని, పందతనంబునను బుద్ధిఁ బాయక ఘను లై
యొంటాక బుద్ధి నెగడెడి, నందాఁకఁ జరింప వలయు నాత్మబలమునన్. 46

ఆ. తల్లిఁ దండ్రి నైనఁ దమ్ముల నన్నల, సఖుల నైన బంధుజనుల నైన
రాజ్యకాంక్షఁ జేసి రాజులు చంపుదు, రవనిఁ దలుచు జీవితార్థ లగుచు. 47

క. పావి యెఱుంగనిపూరుని, జీవన్మృతుఁ డనుచు నింద సేయుదు రతఁడుం
బోవును నరకమునకు దు, ర్భావముతో బ్రతుకు టొక్క బ్రతుకే తలఁపన్. 48

క. పగతుర జెరిచితి ననియును, బగతురచేఁ జెడితి ననియు బాలుఁడు తలఁచున్
బగసెలుములు లే వాత్మకుఁ, బగసెలుములకెల్ల కర్మబంధము నుండీ. 49

క. రక్షణము లేక సాధుఁడు, రక్షితుఁ డగు సమతఁ జేసి రాయిడులందున్
రక్షణములు వేయి గలిగిన, శిక్షితుఁ డగు ఖలుఁడు పాపచిత్తుం డగుటన్. 50

ఆ. ప్రకృతి కామకర్మపరవశ మై యూర్ధ్వ। నీచగతులఁ బొంది నెఱయ బ్రమసి
తిరుగు మర్త్యజనము తెలియ నేరదు నిజ। గతివిశేష మీజగంబునందు. 51

క. నడవడి గొఱగా కున్నను। బడు గైనఁ గురూపి యైనఁ బామరుఁ డైనన్
జడుఁ డైన రోగి యైనను। విడుచుట మర్యాద గాదు విభు నంగనకున్. 52

శా. సంపన్నుం డొరుఁ గానలేఁడు తనువున్ సంసారమున్ నమ్మి హిం
సింపం జూచు దరిద్రుఁ డెత్తువడి శుష్కీభూతుఁ డై చిక్కి హిం
సింపం దన్యుల నాత్మకున్ సములుగాఁ జింతించు న ట్లౌటఁ ద
త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపఁగన్. 53

క. జననీజనకుల వృద్ధులఁ। దనయుల గురువిప్రసాధుదారాదుల నే
జనుఁడు ఘనుఁ డయ్యుఁ బ్రోవక। వనరును జీవన్మృతుండు వాఁడు ధరిత్రిన్. 54

చ. కలఁ గని లేచి మున్ను గలఁ గన్నసమస్తవిధంబుఁ గల్లగాఁ
దలఁచినభంగి మానసపదార్థముచే నిఖిలేంద్రియార్థముల్
బలమునఁ గట్టి తజ్జ్ఞుఁడు ప్రపంచము లే దనుఁ దన్మనంబుఁ దా
రలయక కట్టుడున్ బుధుల కవ్వల నొండొకభేద మున్నదే. 55

ఆ. మానసంబుఁ గట్టి మహితభోగంబులు। మాని యింద్రియములమదము లడఁచి
తపము సేసి యింద్రియతతి కోరుఁ గాని యా। యమృతపదము గోరఁ డజ్ఞుఁ డరయ 56

క. అతిథిజనంబుల భక్తిన్। సతతముఁ బూజించి యుచితసత్కారము లు
న్నతి నడపుసజ్జనులు శా। శ్వతకీర్తులు ధరణిఁ బడయఁ జాలుదు రనఘా. 57

క. పరికింపఁగ దేహం బ। స్థిర మని నిజబుద్ధిఁ దలఁచి చిరతరకీర్తి
స్ఫురణం బ్రస్తుతి కెక్కని। పురుషుఁడు జీవన్మృతుండు భూరివివేకా. 58

క. ధారుణిలోన వదాన్యుల। కీరానిపదార్థ మొక్క టేనియుఁ గలదే
కోరినఁ దన మేనియెముకలు। ధీరుం డై యిచ్చె నని దధీచిని వినమే. 50

చ. అనఘ జితేంద్రియస్ఫురణు లయ్యును జందల మైనమానసం
బనుతురగంబు బోధమహిమాత్మవివేక[illegible]త్రిట న
ల్లన గుదియంగఁ బట్టిను దలంచుదు ముక్తి క్షపాయలాభ మే
ఆపనువున లేమికిన్ వగల నందెదు రాత్మలు వో తలంపఁగన్. 80

# నీ తి బో ధ

గీ. సత్యమూ శమంబు దమమును సంతరించి
పరులబాధల వారింప దలయు నెపుడు
వాఁడు దేశోపకారి యై వఱలుఁ గాన
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 1

గీ. జ్ఞానధనుఁడను బుధుఁడను సకలధర్మ
మర్మముల నేర్చినాఁడను మాన్యుఁడ నని
గర్వపడి బీరములు వల్కఁ గార్య మగునె?
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 2

గీ. తిరిపె మెత్తుచు బీదలు దిగులుపడుచు
కూఁడుగుడ్డకు మలమలమాడుచుండ
ధనముఁ గలవాఁడ నంచు సంతసము నంది
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 3

గీ. అన్నవస్త్రములకు దూర మైనజనులు
చెట్లనీడల వసియించి చివుకుజనులు
నెల్లవేళల దుఃఖింప నింట నుండి
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 4

గీ. కష్టపడి జీవనము సేయ కనులు లేక
కాలుసేతులు లేక సంకటముపడుచు
దిక్కుమాలిన పేదలు దిగులు జెంద
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 5

## నీతిబోధ.

గీ. కాటకములు రోగంబులు నాటుకొనుట
దినము వత్సరముగ నెంచి దిగులుపడుచు
ధనవిహీనులు దుఃఖింప ధన్యుఁడ నని
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 6

గీ. ప్రాయ మది బుద్బుదంబు ప్రాణులకు వినవె
మృత్యుదేవత సతతంబు మ్రింగు నసురె
కాన ప్రాణులపై దయ గల్గియుండి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 7

గీ. అంతరాంతరీ దుష్కృతుల నెల్ల గణనఁ జేయు
మానసము సాక్షిగా నమ్మి మనలు మెప్పు
లోన దుర్మార్గవర్తులఁ బూని సతము
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 8

గీ. కాలపురుషుండు నీతోడ మేలమాడు
మృత్యుదేవత వెనువెంట మెలఁగుచుండు
మోహపాశబద్ధుండవై ముం దెఱుఁగక
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 9

గీ. బిరుదులను దాల్చినంతన పెద్ద యగుదు
నీతులను జెప్పినంతన నెగడఁ బోరు
చెనుగులను జేసి పరుల హింసింపఁ బోకు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 10

గీ. పరులు చేసిన చెడుగుల నెఱిఁగి నీవు
పరుల కవి చేయకుండుట పరమధర్మ
మిట్టిధర్మంబు లెఱుఁగక మిట్టిపడుచు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 11

గీ. ధర్మములఁ దెల్ప నైకమత్యంబు రాదు
సభల నీతుల బోధింప శాంతి రాదు
అంతరింద్రియనిగ్రహ మైనఁ గాని
మానుషా! వేషభాషల మురియఁ బోకు. 12

గీ. సత్యశీలుండ వీ వని శాంతుఁడ వని
పరమభక్తుఁడ వని చాలఁ బ్రస్తుతింప
కుత్సితపుమార్గముల నంటి కులుకఁ బోకు
మానుషా! వేషభాషల మురియఁ బోకు. 13

గీ. సకలధర్మంబులను నేర్చు సజ్జనుండు
సకలజనులను దయఁ బ్రోచు సజ్జనుండు
సకలకష్టంబులకు నోర్చు సజ్జనుండు
మానుషా! వేషభాషల మురియఁ బోకు. 14

గీ. దాత వనియును నయగుణశోభితుఁడ వని
నీతిమంతుఁడ వని నిన్ను నెగడ జనులు
మలినమును బాయలేదు నీమానసంబు
మానుషా! వేషభాషల మురియఁ బోకు. 15

గీ. ధనచయంబులు తరగలు తనువు నష్ట
భోగములు చంచలంబు లై బూడెఁ గలయు
నిత్యవానిని మది నమ్మి మిట్టిపడుచు
మానుషా! వేషభాషల మురియఁ బోకు. 16

గీ. తను వసువులఁ బాసిన యంత దగ్ధ మగును
బూటకంపుభోగంబులు బూడెఁ గలయు
నిమిషమాత్రమునను బాయు నీదు ఘనత
మానుషా! వేషభాషల మురియఁ బోకు. 17

గీ. తోడివారల నెంతయుఁ దూలనాడి
నీటుగోటుబిరకంబును నెఱతనంబు
జాటినంతన జనులు నిన్ సరసుఁ డనరు
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 18

గీ. మృదువు లగుపాన్పులను బండ మేటి యనరు
పుష్పశయ్యల శయనింప భోగి యనరు
ధర్మసత్యశౌచంబులఁ దాల్పకున్న
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 19

గీ. తగినవేషంబు దాల్చుట ధర్మ మంచు
ధర్మపథమున నడచుట తగు నటంచు
సద్గుణంబులు బూనుట సత్య మంచు
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 20

గీ. పరులబాధల మాన్చుట పౌరుషంబు
శాంతమును దాల్చి యుంచుట జాణతనము
గాన బూటకములఁ బూనఁ గార్య మగునె?
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 21

గీ. బాహ్యవేషంబులను జూచి బ్రమసి నిన్ను
నీతిమంతుఁడు నా నది నీటివ్రాలు
మానసము సద్గుణంబుల మరగవలయు
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 22

గీ. పరమదుర్మార్గవృత్తులఁ బాయకున్న
మండగంపుమార్గంబులఁ దొలఁగకున్న
వెంటపుర్వేనకును నీకు భేద మేది
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 23

తే. ధర్మముగా నగుకార్యముల్ * దోసిపుచ్చి
యధర్మంబులు చేయ నే * రనుమతింతు
రట్టివానికి నివియును * నవియుఁ దుదకుఁ
జెడును గావున ధర్మములే * చేయు టొప్పు. 48

తే. ఒకటి సింగమువలన, వే * ఱొకట కొంగ
వలన, మఱిమూఁడు శునకంబు * వలన, గర్ద
భమువలన మూఁడు, కాకంబు * వలనఁ గోడి
వలన నాల్గు నా ల్గభ్యసిం * పంగవలయు. 49

క. జనుఁ డలఁతికార్యమైనను
ఘనకార్యం బైనఁ జేయఁ * గడఁగిన దానిం
గొనముట్టఁ జేసి ఫలముం
గనఁ దగు సింహంబువలెను * గడఁక దలిర్పన్. 50

తే. ఇంద్రియంబులఁ గట్టి ని * స్తంద్రుఁ డగుచుఁ
గడఁక బకమట్లు నిధ్యాన * కలనఁ దనరి
కాలదేశాగతంబు లై * గ్రాలునట్టి
కార్యముల నెల్ల సాధింపఁ * గలఁడు నరుఁడు.

క. కనుభుక్తియు, సుఖనిద్రయు,
నాడయునికడ మేటిభక్తి * యును, శౌర్యంబున్
బడి మేలుకొనుట, స్వల్పం
బిడఁ దుష్టియు శునకమట్లు * తెలియఁగవలయున్. 52

తే. అలయ కెప్పుడు భార మొం * తైనఁ గొనుట
చలికి వెట్టకు నెప్పుడు * నైచియుంట
యునికి కెప్పుడు సంతోష * మొందుచుంట
గర్దభమునొద్ద నేర్చిన * ఘనత గలుగు. 53

ఆ. ఒరునికంటఁ బడక * తరుణి నంటుటయును,
వడిగ నడచుటయును, * బహుపదార్థ
సంగ్రహంబు సేత, * జాగరూకతయును
వాయసంబువలన * వలయు నేర్వ. 54

ఆ. కలుఁగఁ బట్టవలయు, * గలిసి బంధులతోడ
మెసఁగుటయును, వేగి * మేలుకొనుట,
యూర్ధ్వపక్షమునఁ బడఁతి * నరసి ప్రేముడియును
కోడివలన నేర్చు * కొనఁగవలయు. 55

తే. బహుసమర్థునకుం గార్య * భార మేది
దొడ్డయుద్యోగికిం బోవ * దూర మెద్ది
ప్రియము పలికెడువానికి * ప్రియుఁ డెవండు
తెలియ విద్వాంసునకుఁ బర * దేశ మెద్ది. 56

తే. అందలదాటె యగు నింద్రి * యముల నిచ్చఁ
బోవలనిమ్ముట్టు లెపుడు నం * పదలదాటి
యగును దన్నిరోధము గాన * జగతి నరుఁడు
తెలియఁ బరికించి యాదారి * నలయు నరుగ. 57

తే. విద్యఁబోలినచుట్టంబు * పృథివి లేదు
వ్యాధిఁబోలినశత్రువు * వసుధ లేదు
సంతతికిఁ బోలుస్నేహంబు * జగతి లేదు
దైవమును బోలినబలంబు * ధరణి లేదు. 58

క. ఆవరణము సంద్రము ధర,
కావరణము ప్రహరిగోడ * యాలయమునకున్,
ఆవరణ మినుమునఁ బోలిక,
నావరణము సచ్చరిత్ర * మతివకు నరయన్ 59

ఆ. తిండి రెండుజెట్లు, * ధీవిశేషము నాల్గు
జెట్లు, తెగువ యాఱు * జెట్లు, కోర్కె
యును నెనిమిదిజెట్లు * గన బురుషులకన్న
స్త్రీల కెక్కు వనుచుఁ * దెలియవలయు. 60

తే. ఎడఁద సంతుష్టి లేనిమ * హీసురుఁ డంత
తుష్టి గలమహీశ్వరునట్లు * తొడరి చెడును
సిగ్గు గలిగిన వెలయాలు * సిగ్గు లేని
కులసతినిబోలి చెడు నని * తెలియవలయు. 61

తే. అధమవంశజుఁ డై ప్రభు * వైనవాఁడు
నజ్ఞునకుఁ బుత్రుఁ డై విజ్ఞుఁ * డైనవాఁడు
నాదిఁ బేద యై ధనవంతుఁ * డైనవాఁడు
తృణముగా నెంచు జగమెల్లఁ * దెగువమీఱ

క. కులహీనుఁ డైన మిక్కిలి
ఖలుఁ డైనన్ ధనము గలుగఁ * గనుపూజ్యుఁ డగున్
గులముం గలిగి గుణాన్వి
తులుఁ డైనన్ ధనములేమి * జనదూరుఁ డగున్. 63

క. గాలికి వృక్షము భయపడుఁ,
బ్రాలేయము నెండకును దమ్మి * భయపడు, ఘనదం
భోళికిఁ గుధరము భయపడుఁ,
కూటికి జగమెల్ల వడకు * కొనుచు భయపడున్. 64

క. తెలియక మూర్ఖునిఁ దనకుం
గలకార్యమునందు నిలిపి * కనుమూచినభూ
తలపతి కయశం బగు మి
క్కిలి సొమ్ము బోవు నరకే * కిల్బిషము నగున్ 65

క. తెలిసినవానిని దనకుం
గలకార్యమునందు నిలుపఁ * గలిగినయే భూ
తలపతికి యశము గలుగును
బలుధన మొనగూడు స్వర్గ * వాసము నబ్బున్. 66

తే. పశువుమాడ్కిఁ బరివర్తించి * పిశునవృత్తి
నుండుమూర్ఖజనంబుల * పిండునలనఁ
గప్పఁబడిపోవు సద్గుణ * గణములెల్లఁ
గాఱుకొనుమబ్బువలన భా * స్కరుఁడుమాడ్కి 67

క. ఎవ్వని కగు నోరు మఱిగిన
జవ్వని యాభార్య, యేటి * సరసను బోలముం,
జెప్పిన వినయము గలసుతుఁ
డవ్వానికి మృత్యుతుల్య * మగుకష్ట మగున్. 68

తే. కోఁతి గీతంబు పాముకు * గోనబుగాను
తాయి పాథోధి నీఁది పా * రంబు నొందు
నని యసంబద్ధములు జనుఁ * డాడరాదు
దాన మిక్కిలి నవ్వబా * లౌను దనకు. 69

ఆ. ఎపుడు కఱవు లేదు * కృషకునకు; కొత్త తేఁ
జెగులు లేనివాని * కిగును సుఖము;
మగనియందుఁ బ్రేమఁ * గలిగినసతి గల
వాని కిల్లు పండు * వౌ ననిశము. 70

తే. ముసలితనమున నేకార్య * మును నరుండు
చేయఁ జాలఁడు గావునఁ * జిన్నతనము
నందు విద్య గ్రహించి తా * నవల ధనము
వడసి సత్కార్యములు-సేయ * వలయును సుమ్ము. 71

# మరణము

చ. మరణ మఱంగ నే మనుచు మానసమందుఁ దలంచుచుంటివో
నరుఁడ! సమస్తజీవులకు నాకును నీకునుఁగూడఁ జుట్టమై
దరిగ మెలంగుచుండియును దా నదనైనపు డేగుదెంచి స
త్వరముగ నాక్రమించెడిని దాని తెఱం గెఱుఁగం దలంపుమీ.

చ. నిదుర నెఱింగి యుందు కద! నీ కది యెట్టులు వచ్చు! వచ్చిన
న్నిదిరని నిన్నెఱుంగ వది యేమి! యెదం గలతొంటిబుద్ధి యే
పదమునఁ జేరె? నీ వెచట వర్తిలు దప్పుడు చెప్పు? మట్టిదే
కద మృతి! పెద్దనిద్దురయె, కాదన రాదు సుమీ మనుష్యుఁడా!

చ. సుకములలో సుకం బగును జూ మరణం బది వచ్చె నేని నీ
వకటకటా! భయంపడుదువా మఱి సంసృతిబద్ధకష్టముల్
కకవికలై నశించు నని కాంచి మదిన్ సుఖయింప నెంచవా
చికమక వోఁదిరుండ వయి చెన్నలరారఁ గలాఁడవా? నరా!

శా. ఆలుం బిడ్డలు నన్నదమ్ములును లోనైనట్టిచుట్టాలకున్
బాళిం గల్గినఁ గాని నొప్పి తనదే వ్యాధ్యాదులన్ స్వాంగమం
దోలిం గల్గినఁ గాని నొప్పి తనదే యూహింప నీనొప్పులన్
లీలం బాపి సుఖం బొసంగు మృతి, దాని న్మెచ్చరాదో జనుల్.

ఉ. పిల్లులమోఁత్రవోలెఁ గడు బీతుగఁ గుత్తుకలోనఁ గళ్ళె రా
నీళ్ళును బాలునుం దిగక నేలకు నింగికి నూపి రాడకే
క్కిళ్ళను నోకియుం గలుగఁ గ్రిందును మీఁదును గాన కార్తిమై
దెక్లైనప్పు డెంతువు మృతిం గోదవో నని కాదె మర్త్యుఁడా!

చం. గోదలకునై ధనాదులకుఁ గూడక దైన్యము నొంది నీచులన్
బదుగుర వేఁడి లేదనఁగఁ బాలిశవృత్తికిఁ జొచ్చి భూమిపై
బ్రిదుకుటకంటె చచ్చుటది భవ్య మటందురు గాదె దేహమే
గోదయగు జీవికంచు మృతిఁ గోరుట పోల దొకో మనుష్యుఁడా.

# కావ్యము

మ. అరయన్ వార్ధిపరీతభూతలమునం దాచంద్రతారార్కము
స్థిరనీహారకలాధినాయకశిరజ్జీమూతకైలాసభూ
ధరవాసంతికమల్లికాకుసుమసుత్రామేభసంకాశ మా
వరకీర్తిన్ గలిగింపఁ జేయునది కావ్యం బన్న సామాన్యమే?

మ. సరసంపున్నుడులన్ వెలుంగుచును, విజ్ఞానాఢ్యులై యొప్పనె
ల్లఱచే మ్రొక్కఁగ జేసి, మిక్కిలిగ నుల్లాసమ్ముఁ జెందించి, సు
స్థిరభక్తిన్ గుసుమంపుఁబూజనములం జేయించి, రత్నాంబరా
భరణాదుల్ పొసఁగింపఁ జేయునది కావ్యం బన్న సామాన్యమే?

మ. ధర నెవ్వారలవృత్తు లెట్టివియొ, యేదారిన్ బ్రవర్తింప ను
ర్వరఁ జేకూఱునొ కష్టమున్ సుఖమునున్, భారంపుసంసారసా
గరమున్ దాఁటుట యెట్టులో, విశదముం గావించి విజ్ఞానసం
భరితస్వాంతులుగా నొనర్చునది కావ్యం బన్న సామాన్యమే?

మ. పరదారం గలయంగరా; దొరులద్రవ్యంబున్ హరింపంగరా;
దొరులన్ మోసము సేయఁగూడ; దనృతమ్మొక్కప్పుడున్ బల్కరా
దరయన్ గష్టము సంభవించు నని సువ్యక్తమ్ముఁ గావించి యు
ర్వర భద్రమ్ములఁ గల్గఁ జేయునది కావ్యం బన్న సామాన్యమే?

మ. సరళంబై యలరారుశైలియును, భాస్వన్నూత్నముల్ కల్పనల్,
కరమున్ ముద్దులు గుల్కుపల్కులును, విన్నాణంపుభావంబు ల
చ్చెరువుం గూర్చెడివర్ణనల్ గలిగి వాసిం గాంచి యెంతేని ను
ర్వర సద్యస్సుఖ మొందఁజేయునది కావ్యం బన్న సామాన్యమే?

మ. గురుసమ్మోదముతోడ డాపలిదెసన్ గూర్చుండి నెమ్మోమునన్
దరహాసం బొలయంగఁ బొంగుచును గేల్దమ్మిన్ బయిం జేర్చి సా
దర మొప్పన్ నయబోధ సేయుసతికిం దార్కాణమై నిచ్చలున్
వరమార్గమ్ము లభింపఁ జేయునది కావ్యం బన్న సామాన్యమే?

## ఆ ఱ వ ప్ర క ర ణ ము

అజాఫ్ ఖానుఁడు కనోజురాజును వంచించి తాఁ గాంక్షించుచంచలాక్షి నెన్నఁడు పొందుదునా యని క్షణక్షణము మనస్సంతాపమునకు లోనై తనయుద్యోగవిధులను గూడ మఱచినవాఁ డయ్యె.

ఇట్లుండ, నొకనాఁడు ఢిల్లీలోఁ జక్రవర్తి దర్బారు జరగనై యుండె. ఆదర్బారునకు రాజప్రతినిధు లందఱును బోవలసివచ్చెను. దర్బారులో నేవిషయముల నెట్లు చర్చింపవలెనో యెఱుంగఁ గోరి, ఖాను తనయాంతరంగికు లగు రహిమాన్, అబ్దుల్ ఖానులను రావించి వారితో నిట్లు ప్రసంగించెను.

అజాఫ్—రహిమాన్! ఢిల్లీహుజారున నింక వాగముదినములకు దర్బారు జరుగునని ఫర్మానా వచ్చినది. అందునకై నేను బోవలసియున్నది. కనోజురాజు బడా బద్మాష్. మనరాయబార మింకను మన్నించు నని తోఁచదు. అతని వంచింపఁ జక్రవర్తి కడ నిదివఱకు మన మెన్ని ప్రయత్నములు చేయుచున్నను నవి యన్నియు వ్యర్థము లయ్యెను. పైఁగా మనపైనిఁ జాలా మహజరులు దాఖలయినవి. చక్రవర్తికి మనయం దనుగ్రహము గనుక మహజరు లివఱకు మనలను బాధించలేదు. ఇంక నెన్ని మహజరులు నిలువయున్నవో తెలియదు. ఈసారి యేదియో యొకమంచిపన్నుఁగడ పన్ని చందనుని వంచించి యానుందరిని సాధింపవలెను.

రహిమాన్—మీయందు నిజమైనభక్తి గలిగి కష్టమనక సుఖమనక, రాత్రింబవళ్లు నిద్రాహారము లెఱుంగక, చావునకు జంకక మీ రాడు మన్నట్లెల్ల నాడి మీహితంబులు నెఱవేర్చుమాయందు మీకు నమ్మకము లేక ఘుర్ మండలాధీశునిబోధనములకు లోనగుచుండ మాసలహాలు మీరు పాటించుదురా?

అబ్దుల్—మే మేమి చెప్పినను మీకు రుచింపదు. ఆరాచవాఁడు తియ్యని మాటలతోఁ జెప్పునదే పథ్యము. అతఁడు వెనుకనుండి గోతులు త్రవ్వువాఁ డని చెప్పినను మీకు నచ్చదు.

రహిమాన్—అతనిముం దేమి చెప్పుటకును నాకు భయమే. ఇచ్చట మనరహస్యము లన్నియు నతనివలననే రచ్చకుఁ బోవుచున్నవి. కావున మీ రాతనిస్నేహము వీడినఁ గాని మనకార్యము లనుకూలింపవు.

అజాఫ్—అతఁ డిదివఱకు మన కేమియు హాని తలంచినట్లు కనఁబడదు. హిందువుఁ డగుటచే నాతనిపై మీ కనుమానము కలదు. కాని యతఁడు నిరంతరము మన కడకు వచ్చుచు మనసఖ్యమును గలిగియున్నాఁడు. కావున నాతనియందు నా కట్టి యపోహమును లేదు. యుద్ధము పొసఁగలేదు కాని యాతఁడు మనతోఁ గూడ కనోజాపైకి సిద్ధముగా నున్నాఁడు.

రహిమాన్‌ఖాను } సరే. కొలదిలో మీకే బోధపడును.
అబ్దుల్‌ఖాను } వేఱ చెప్ప నేల?

అజాఫ్—ఇంకఁ గర్తవ్య మేమి?

రహిమాన్—మన కొక్కబేరమే కాదు. ఇంకొకగట్టిబేరము కూడ తగిలినది.

అజాఫ్—ఆగట్టిబేర మేమిటి? ఇంకొకసుందరి యెచ్చట నైన నున్నదా యేమి?

రహిమాన్—ఇంకొకసుందరిపఱకుఁ బోవుదు రేమి? మీరు కోరినయొక్కసుందరి వలననే రెండుబేరములును—

అజాఫ్—ఆసుందరిని బెండ్లియాడిన నామెతో నింకొకర్తు లభించునా యేమి?

రహిమాన్—బేరము లనఁగా లడ్కీలు కాదయ్యా—లడాయిలు.

అజాఫ్—కనోజారాజున కింకొకరు సాయము చేయుచున్నా రనియా నీయభిప్రాయము?

రహిమాన్—"సందేహ మేమి? చిత్తూరు కనోజు లొకటి యయినవి. రాణా విక్రమాజితుఁడు మీయాసను దన్నివేసినాఁడు. ఆస్త్రియే మీకుఁ గావలె నన్న ముందు చిత్తూరుపై కురుగవలెను. ఇదిగో యీకాగితమును జూచికొనుఁడు. సంగతులు బోధపడును." అని కాగితము నిచ్చెను.

అజాఫ్‌ఖానుఁ డాకాగితమును సాంతముగాఁ జదివించుకొని తనయాశకు భంగము గలిగె నని విచారమును, కనోజారాజుపైఁ గసితీర్చుకొనవచ్చు నని కొంతతృప్తియుఁ గలిగినవాఁడై "నీ కీకాగిత మెట్లు లభించినది?" యని రహిమాను నడిగె. రహిమాన్ ఖానుఁడు ప్రభువుతో "స్వామీ! మీరు కనోజుపైఁ బగ పూనినది మొదలు నా

మిత్రులలో నమ్మక మైన గులామ్‌ఖానును ఫకీరువేషముతో నాపట్టణమున వసింపఁజేసి యప్పుడప్పుడు వానినుండి యచ్చటిరహస్యముల నెల్లఁ దెలిసికొనుచుంటిని. మొన్నటి దినంబున చందనుఁడు పన్నినయారహస్యమును గులాము తెలియఁజేయఁగా నాతనికి మఱియేవురిని దోడు జేసి గ్వాలియరుసమీపమున దారిగాపించితి. అంతఁ బల్లకి గ్వాలియరు సమీపించుటయు, మార్గాయాసమున బోయీ లచ్చట నిద్రించుటయు జరిగె. మనగులాము మొదలయినవారు బాలికతోఁ బల్లకిని మెల్లఁగ భుజములపై కెత్తికొని మోసికొనివచ్చుచుండఁగా, బాలిక మెలకువ గాంచి గుభాలునఁ గ్రిందికి దుమికి పాఱి పోయినది. మనవారల కప్పు డీకాగితము పల్లకిలో దొఱకెను." అని చెప్పెను. అనవుడు "హా! గులా మంతటివాఁడా? అతని బహూకరింపవలెను. నీతో వచ్చి యుండెనా?" యని అజాఫుఖానుఁడు వచింప, రహిమాన్‌ఖానుఁడు కొంత విచారించి "ప్రభూ! అంత నాబాలికను వెంటఁ దగుల, బోయీలును నింకొక్క సేవకుఁడును నామెకుఁ దోడై గులాముతో మఱియిర్వురను గూడఁ గడతేర్చిరి." అని ప్రత్యుత్తర మిచ్చెను. అజాఫ్‌ఖానుఁడును నందులకు విచారించి చచ్చినసేవకులకుటుంబములకు నెలనెలకుఁ గొంతద్రవ్యసాహాయ్యము చేయుచుందు మనెను.

పదఁపడి అజాఫ్ రహిమాన్‌ఖానులసంభాషణ మిట్లు నడచె:—

అజాఫ్—ఆసుందరి యిప్పు డెచ్చట నుండును?

రహిమాన్—చిత్తూరునందే యుండును.

అజాఫ్—ఆమె యచ్చట నుండుటచే మనము ముందుగాఁ జిత్తూరుకోటను ముట్టడించుసాధన మాలోచించి గావింపవలెను.

రహిమాన్—సందేహ మేమి? ఈయుత్తరము మన కన్నివిధముల మహోపకారముగ నున్నది. చక్రవర్తి యీయుత్తరమును జూడఁగనే మనము చిత్తూరుపైకేఁ గాని కనోజుపైకిఁ గాని కాలుదువ్వుట కభ్యంతరము చెప్పఁ డని తోచుచున్నది.

అజాఫ్—చక్రవర్తి చిత్తూరుపై నీఁటికే యొకకన్ను వేసియున్నాఁడు. కాని కారణము లేక కాలు దువ్వుటకు మోమోటించి యూరకొనెను. ఇప్పుడు చక్రవర్తిని బురిగొల్పఁగల నని తోచుచున్నది. చిత్తూరుపని ముగిసినవెంటనే కనోజాధ్వని యన నెంత?

అంతట దుల్ఫట్‌షా యచ్చటఁ బ్రవేశింపఁగా, రహిమాన్ అబ్దుల్‌ఖానులు మోములు దించుకొనిరి. అజాఫ్ వాని నెప్పటియట్లు గారవించి తాను ఢిల్లీదర్బారు నుండి తిరిగి వచ్చినవెంటనే చిత్తూరుపైకి దండయాత్రి యుండు ననియుఁ దనకు సాహాయ్యము చేయవలసిన దనియుఁ గోరెను. దుల్ఫట్‌షా ఖానునివ్యవహారమునకు లోన నోర్వలేకున్నను, ముప్పు గడపుకొనుటకుఁ దప్పక చేసెద నని యొప్పుకొనెను.

## ఏడవ ప్రకరణము.

ఆనాటిరాత్రి భోజనములవేళ గడచి సీతానగరవాసులందఱు నిద్రించుసమయమున నొకయాచకుఁడు వీధులందు మాధుకరవృత్తి సంచరించుచుండెను. వాఁడు గ్రామమంతయుఁ దిరిగెను గాని యేగడపవద్దను బట్టెఁడన్నము గొనియుండలేదు. అట్లా యన్నార్థి తిరిగితిరిగి ముందటిప్రఖ్యాతిం జేసి ముదుసలియొక్కగడపకడ నిల్చి "మాధవకబళ మమ్మా!" యని కేక వేసెను. ఆసమయమునఁ దాతయు బాలికయు నదివఱకుఁ జాలసేపు జనార్దనుఁడు వచ్చునేమో యని భోజనము సేయక నిరీక్షించి వచ్చుకాల మతిక్రమించిన దని యప్పుడే తాము భోజనము చేసి పరుండిరి. తాత పెద్దలనాటిచరిత్రములను గథలను జెప్పి బాలికకుఁ దృప్తి గావించుచుండెను. ఆకేక బాలికచెవుల సోఁకఁగనే, కనికరము బద్ధకమును జయింప, వెంటనే లేచి వంటయింటిలో మూతపెట్టియున్న కలశములోనియన్నమును దధిశరపదార్థములను నొకయాకునఁ బొట్లము చుట్టి బిచ్చగాని కిడ వీధితలుపు తెఱచెను. అప్పుడు వృద్ధుఁడు "అమ్మాయీ! చీఁకటి రాత్రి యొంటరిగ నావలకుఁ బోకుము. నేనును దోడుగ వచ్చెద నాగు" మనెను. బాలిక సహజధీర యగుటచే "దాదా! భయము లేదు. నీవు లేచి రావద్దు. ఇప్పుడే యన్నమిడి మరలి వచ్చెద" నని చెప్పి వెలుపలిగడపలో నడుగిడి యాముష్టివాని యొడిలో నన్న మిడఁబోగా వాఁడు చటుక్కున నామెచేయి పట్టుకొని నడివీధిలోనికి లాగికొనిపోయెను. ఆమె యబల యైనను సాహసమందుఁ బురుషులను మించినది గావున నాకపటయాచకునిముక్కుముక విఱుగునట్లు శక్తికొలఁది నొక్కమణుఁగుగుద్దు మద్దు చూపెను.

అంత నాదుర్మార్గుఁడు "హా! చచ్చిపోతిని. చచ్చిపోతి" నని యొడ లెఱుంగక నేలఁ గూలెను. బాలిక చేయి విడిపించుకొని చటాలున నింట దూఱి తలుపు మూసికొనెను. కపటయాచకుని మొఱ్ఱ విని చెంత దాగియున్న నలుగురుదుష్టులు బిలబిల నేతెంచి నేలఁ గూలినతమమిత్రుని సేద దీర్పఁ గొంతవడి నుపచారములు సల్పిరి. కాని ముక్కుదూలము విఱిగి యపరిమితముగ రక్తము గాఱుటచే నప్పటికే విస్మారముఁబొందుచున్న యాతఁడు తనకుఁ గలిగినముప్పిది యని కూడ వారలకుఁ జెప్పలేకపోయెను

పిమ్మట వా రా దీనుని నచ్చటనుండి తీసికొనిపోయి వేఱొకచో నుంచి వృద్ధుని యింటితలుపులు పగులఁగొట్టి దూరిరి.

బాలిక తనకుఁ గలిగినవిపత్తు నావఱకే యూహించియున్నందున, వృద్ధుఁడు తన కత్తినిసర్యోడ సిద్ధముగఁ జేతిలో నుంచుకొని, "చింతచచ్చినను బులు పణఁగ" దన్నట్లు లొక్కమాఱుగఁ దనశౌర్యపారావారము మేర మీఱ వారల నెదిరించెను. అవఱకుఁ జాలకాలమునుండి మానవరుధిరాహారము లేక మూలఁ బడియున్న యాముదుసలియొక్క దారుణకృపాణము తత్క్షణమే యొక్కనిరక్తమును బ్రాణములతో సైతము గ్రోలెను. అంతఁ గోపావేశముతోఁ గాసమును నావేశింప ముదుసలికి నలసట వొడమె. అప్పు డాదుర్మార్గులు వృద్ధుని జిత్రవధ చేయుచుండఁగా, బాలిక "దాదా! దాదా! నా కేమిగతి?" యని బిగ్గఱగా నేడ్చుచుఁ దన్నుఁ గూడఁ జంపుదు రేమో యని భయ మంది యింటిలో వెల్గుచున్నదీపము నార్పివేసి యొకమూల దాగికొని దేహస్మరణము లేక వేలఁ బడెను. కాని కాఱుమబ్బునుండి దుఱుంగలించు మెఱపుఁదీగలాగునఁ జీఁకటిలోఁ గనులకు మిఱుమిట్లు గొలుపునా తెఱవమఱుంగు తెఱం గెఱింగి యక్కఱకరులు బిఱబిఱ నామె నెత్తికొని పోవుచుండఁ ద్రోవలో మోటా యామెకుఁ దారసిల్లి "ప్రాణేశ్వరీ! వివాహము కాలే దని కాఁబోలు నానాఁడు రాత్రి నన్నుఁ దిరస్కరించితివి. నిన్ను నే నింకఁ బెండ్లియాడెదను. నీవు చిత్తూరునకు రాణి వగుదువు." అని పచింప, నాచిన్నది "చిత్తూ రెన్నఁ డైన నశించునా?" యని యొక్కమొత్తు వెట్టెను.

అట్లు బాలికను వారు తీసికొనిపోయినకొంతసేపటికి జనార్దనసింగు సీతానగరమునకు వచ్చి యింటిగడపలో నడుగిడినంతనే తలుపులు తెఱచియుండుటయు, నింటిలో దీపము లేకపోవుటయుఁ జూచి యేదియో యుపద్రవము గలిగినట్లు తెంచి "బాబా! తలుపు తెఱచినా వేమి?" యని పచించెను. లోనుండి ప్రత్యుత్తరము లేదు. అదివఱకు దా నింటికి రావేగమే యెదురు సనుబాలికయు నప్పుడు కానరాలేదు. అంత సింగున కాందోళన మతిశయింపఁగా నింటిలోఁ బ్రవేశించి యద్దగోడపైఁ జేయి పెట్టి వెదకెను. అంత యథాస్థానమునం దగ్గిపెట్టె చేఁజిక్కెను. సింగు అగ్గిపుల్లను గీసి చెంత నున్నదీపస్తంభముపై వత్తిని వెలిఁగించి చూడ, నట్టింట నవయవములు తెగఁగొట్టఁబడి పడియున్న వృద్ధునితుండె మాతనికిఁ గానవచ్చె. బాలిక యేమూలను గనఁబడలేదు. అంత జనార్దనుఁడు పౌరుషము బాసి స్త్రీవలె గుండెలు బాదుకొని యేడ్వసాగెను. బాలికకొఱకును

గొంత విచారించెను గాని యంతఁగా నేడ్వలేదు. ఏల యన, ఒకరసపుత్రశవ మచ్చటఁ గనఁబడినందున నాటిరాత్రి బాలికను వెంటఁ దగిలినదుష్టుఁడే వృద్ధుని జంపించి యామె నపహరించియుండు నని యతనికిఁ దోఁచెను.

ఆపదలఁ గడవఁజేయుధైర్యగుణ మంత నంతరంగంబునఁ బొడమినందునను, వైరాగ్యమార్గ మెఱింగియున్నందునను జనార్దనసింగు దుఃఖమును లోలోన నుపశమింపఁజేసి కొని బాలికకై యెల్లవీథులు, సందులు, గొందులు వెదకుటకుఁ గడంగెను. బాలిక గనఁబడలేదు. కాని యొక్కయరుగుపైఁ బెనుమూల్గు వినఁబడినందున నది యే మని సింగు చూడఁబోవ నొకరోగార్తుఁ డచ్చటఁ గానవచ్చెను. జనార్దనుఁ డారోగిని "ఏమికారణంబున మూల్గెద?" వని యడిగెను. రోగి "బాధ బాధ" యని చెప్పెను. కాని యింకేమియుఁ జెప్పలేదు. విశేషబాధకారణంబున నధికముగఁ జెప్పలేకుండె నని జనార్దనుఁ డనుకొని యాతనిపైఁ గనికరము వొడమ "నిచ్చట నొంటరిగ నేల యుండెదవు? మాయింటికి రమ్ము. కొనిపోవుదు" నని చెప్పెను. రోగి యాజరగిన ప్రసంగమువలన జనార్దనుని వేలోకపుణ్యాత్మునివలె భావించి "నడవలేను" అనెను. "చేయి పట్టుకొని మెల్లఁగఁ దీసికొనిపోవుదును రమ్ము" అని జనార్దనుఁడు వానిని లేవఁదీసి వీథివెంబడి మెల్లఁగాఁ జేయిసాయమున నడపించుచు నింటిని సమీపింపఁబోఁగా నావ్యాధితుఁ డాయింటెని గుర్తెఱింగి "నేనింక నడవలేను. నడవలేను" అని గుమ్మాలున నేలఁ జతికిలఁబడెను. జనార్దనుఁడు "ఇంక నెంతయో దూరము లేదు. ఎదుటిదే మాయిల్లు." అని తిరిగి లేవఁదీయ యత్నింపఁగా వాఁ డెడిగిలఁబడి యప్పుడే చచ్చిన వానివలెఁ గాలుసేతులు నిగుడఁదన్ని గ్రుడ్లు తిరుగవేసెను. అంత జనార్దనుఁడు రోగి తనచేతిలోఁ జచ్చె నని చింతించి చీఁకటిగ నుండుటచే వాని నచ్చట విడచి దీపమును దెచ్చుటకై యింటికిఁ బోవుచుండఁగాఁ గొన్నిగజములదూరము సాగనిచ్చి యాతెవులుఁగొంటు లేనిశక్తి దెచ్చిపెట్టుకొని చటాలున లేచి పాఱిపోవుచుండెను. వాఁ డట్లు పోవుట గని జనార్దనసింగు వాని నొకకపటవేషధారిగ భావించి వెనుకకు మరలి వెంబడించి పట్టుకొనఁగా వాఁడు చేయి విదలించుకొనిపోవ యత్నించెను. జనార్దనున కనుమాన మినుమడింప నాతని బోవనీక నిర్బంధించి యింటికి నీడ్చుకొనిపోయి నిట్రాటికి వెడరెక్కలు విఱిచి కట్టెను. అంతఁ దెల్లవారఁగా నూరిలోనికొందఱు వీథివెంబడిఁ బోవుచు "నిన్న గడ యెక్కి యాడినయాఁడువాఁడు వీఁడే. ఈతఁ డేమియపరాధము

చేసియుండెరే" నని యనుకొనసాగిరి. ఊరిలో నీఁటిపాండ్రు గడ వేసి యాడినా రని యప్పుడే విని జనార్దనుఁడు తనతండ్రిని జంపి బాలిక నపహరించినదుర్మార్గులే బాలిక జూడ తెలియుంగుటకు నీఁటివాండ్రవలె వేషధారులై వచ్చినా రని తలంచి యారోగిని "నిజమైనవృత్తాంత మంతయు నెఱింగించిన వదలిపెట్టుదు" ననియు "లేనిచోఁ జంపి వేసెద" ననియు బెదరించెను. రోగియు సగము చచ్చినవాఁడు కావున బూర్తిగాఁ జావవలసివచ్చు ననుభయముచేతను, దనతోడివారు తన్నొంటరిగఁ జేసి చనినా రనుద్వేషముచేతను నున్నది యున్నట్లు చెప్పెను. కాని బాలిక తనముక్కు-మీఁద గుద్దినసంగతిమాత్రము చెప్పికొనక పడిపోతి నని చెప్పెను. జనార్దనసింగు గతించినదంతయు దైవవశమే యనుకొని దీనుఁ డైనయారోగిని రెండుతన్నులుమాత్రము తన్ని పొమ్మనెను.

తరువాత జనార్దనుఁడు బ్రాహ్మణులను రావించి ముసలివాని కగ్నిసంస్కా-రాదిక్రియలు జరగించి యాయూరు విడచి చనెను.

తేది .....

ధర్మపుత్రుఁడు పోయి పోయి

నందున నా గ్రామముచివర నున్నయొకకుటీరములో వాఁ డారాత్రి విశ్రమింపఁ దలఁచి యాశ్రయముకొఱకు గృహయజమానురాలిని వేఁడుకొనఁగా, నామె పండుకొనుటకుఁ దా విచ్చెను. కుటీరమున నామె తక్క నింకెవ్వరును లేరు. ఆమె యొంటరిగ నిల్లలుకుచుండెను. ధర్మపుత్రుఁడు గృహములోనికిఁ బోయి పొయ్యిప్రక్కను నామె చేయుపనులను బరిశీలించుచుఁ బన్నుండెను. ఆమె యిల్లలికి శుద్ధిఁ జేసి మేజాబల్లను తువాలతో శుభ్రము చేయ నారంభించెను. బల్ల శుభ్రముకాఁగానె, తువాలమైల కొంత దాని కంటుకొనెను. తిరిగి యామె బల్లను దుడిచెను; కాని మైల యేమాత్రమును బోలేదు. మరల నామె బల్లను జక్కగఁ దుడిచినను, నొకచోట నుండిన మైల యింకొకచోటికిఁ బోయెను. ఆమె తిరిగి యొకవైపునుండి మఱియొకవైపునకుఁ దుడిచెను; కాని మురికితువాలతోఁ దుడుచుటవలన, మైల యొకచోటినుండి మఱియొక చోటికి మాఱుచుండెను. ఒకదిక్కునఁ దుడిచిన, నింకొకదిక్కునఁ గాన్పించుచుండెను. ధర్మపుత్రుఁ డది గాంచి “అమ్మా! ఏమి చేయుచున్నావు?” అని యడిగెను.

“నీవు చూచుచుంటివి గదా? నాయనా! నేఁడు పుణ్యదిన మని యింటిని శుద్ధిఁ జేసితిని. తరువాత మేజాబల్లను దుడుచుటకుఁ బ్రారంభించితిని. నే నెంత తుడిచినను, అది శుభ్రము కాలేదు. మైల మొదట నె ట్లుండెనో యిప్పుడును న ట్లె యున్నది. నే నాయాసము జెందితిని.” అని యామె ప్రత్యుత్తర మిచ్చెను.

“మొదట నీవు బాగుగఁ దువాలను దులిపి శుభ్రము చేసినయెడల, ననాయాసముగ బల్లను శుభ్రము చేయఁగలవు.” అని ధర్మపుత్రుఁడు చెప్పఁగా, నామె తువాలను శుభ్రముగ దులిపి దానితో బల్లను దుడిచెను. అప్పుడు బల్ల పరిశుభ్ర మయ్యెను. “నాయనా! నీ వుపాయము చెప్పి మహోపకారము చేసినావు.” అని యామె వానిని శ్లాఘించెను.

మఱుసటిదినము ప్రాతఃకాలమునకు మున్నె సెలవు గైకొని ధర్మపుత్రుఁడు తన దారిని బహుదూరము పోయి యొకవనము చేరెను. అక్కడ కొందఱుకృషకులు చక్రము చేయుటకయి యినుపపట్టాను నొకగుండ్రనిదూలముపై మోపి వంచుటకుఁ బ్రయత్నించు చుండిరి. కాని యాదూలము స్థిరముగ లేక జరిగి జరిగి పోవుచుండెను. అది చూచి వాఁడు “అన్నలారా! మీ రేమి చేయుచున్నారు?” అని ప్రశ్నింప, “మేము చక్రము కొఱకుఁ బట్టాను గుండ్రము చేయుచున్నాము. రెండుసారులు నిప్పునం దుంచి మెత్తపడునటులఁ గాల్చినను, వంచుట కది సాధ్యము గాకున్నది. మే మలసితిమి.” అని వారు చెప్పిరి.

అంతట ధర్మపుత్రుఁడు “మంచిది, అన్నలారా! పట్టాను దేనిమీఁద మోపితిరో, యాదూలమును గదలకుండ స్థిరము చేయుఁడు. పిమ్మట దానిమీఁదఁ బెట్టి పట్టాను వంచిన, నది తప్పక వంగును.” అని యుపాయము దెలుపఁగాఁ గృషకు లటులఁ జేసి కృతకృత్యు లయిరి.

ధర్మపుత్రుఁడు వారితో రాత్రి గడపి మఱునాఁడు తిరిగి ప్రయాణ మయ్యెను. పగలంతయు రాత్రియంతయు నడచి సూర్యోదయమునకుఁ గొంచెముపూర్వ మొకగొల్లవాండ్రగుంపును జూచెను. ధర్మపుత్రుఁడు వారివద్దఁ బండుకొనెను. వారు పశువులను మంద చేసి మంటఁ జేయుటకు యత్నించుచుండిరి. వా రెండుపుల్లలు తెచ్చి నిప్పు చేసి యవి బాగుగ మండుటకుఁ బూర్వమె పెక్కుపచ్చిపుల్లలు వానిమీఁదఁ బడవేసిరి. పచ్చిపుల్లలు చిటపట శబ్దము చేయుచు నిప్పు నార్పెను. గొల్లవాండ్రు తిరిగి యెండుపుల్లలు తెచ్చి నిప్పు చేసి వానిమీఁద మరల నొకపచ్చికట్టెలమోపును బడ వేసి నిప్పును జల్లార్చిరి. ఈవిధముగఁ బలుమాఱు మంటఁ జేయఁ బూనిరి గాని, మంట కానె లేదు. అప్పుడు ధర్మపుత్రుఁడు “తడిపుల్ల లన్నియు నొక్కమాఱుగఁ బడవేయకుఁడు. ఎండుపుల్లలు బాగుగ మండినతరువాత, కొంచెముకొంచెముగఁ బచ్చిపుల్లలఁ జేర్పుఁడు.” అని వారికిఁ జెప్పెను.

గొల్లవాండ్రు వానిమాటప్రకారము మొదట నెండుపుల్లలతో మంటఁ జేసి వానిమీఁద తక్కినపుల్లలు వేసిరి. పిమ్మట నవియు మండ, నొకపెద్దమంట యయ్యెను.

ధర్మపుత్రుఁడు కొంతసేపు వారితో నుండి తిరిగి బయలుదేరెను. “నేను మూఁడుసంగతులఁ జూచియుంటిని. దీనితాత్పర్య మేమి? తాత్పర్య మించుకేనియు నిశ్చయింపఁజాలకున్నాను.” అని వాఁడు తనలోఁ దాను భావించుచు నడచుచుండెను.

# VIII

ధర్మపుత్రుఁ డింకను ముందరకుఁ బోయి సంధ్యాసమయమున నొకవనములోనికి వచ్చెను. ఆవనమునం దొకకుటీరము కలదు. వాఁ డాకుటీరపుతలుపుఁ దట్టఁగా, లోపలనుండి యెవరో "నీ వెవరు?" అని యడిగిరి.

"నే నొకఘోరపాతకిని. ఇతరులపాపము పరిహారము చేయఁ బోవుచున్నాను." అని ధర్మపుత్రుఁడు చెప్పఁగా, లోపల నున్నజ్ఞాని వెలుపలకు వచ్చి "నీ వెవ్వరిభారము వహించుచున్నావు? వారిపాప మేది?" అని ప్రశ్నించెను.

ధర్మపుత్రుఁ డొకటితరువాత నొకటి ధర్మపితవిషయము, భల్లూకియు దానిబిడ్డల యొక్కయు సమాచారము, మూయఁబడియున్నగదిలోనిసింహాసనము నెక్కినందునకు ధర్మపిత తనకుఁ జెప్పినయుపదేశము, పొలమునందుఁ గృషకు లావును వెంటనంటుటచేఁ బైరునకు గలిగిననష్టము, ఆవు తనయజమానురాలిపిలుపు విని వహించినశాంతము, మున్నగు సకలవృత్తాంతముల నాద్యంతముగ విశదీకరించి "అమంగళముద్వారా యమంగళము వినాశము జెందనేర దని బాగుగ గ్రహించితిని; కాని యేవిధముగ నమంగళము దూరము చేయ నగునో, యది యిప్పటికిని దెలిసినదికాదు. మీరు నా కది బోధపఱుపుఁడు" అని ప్రార్థించెను.

"మార్గమున నిం కేమి చూచితివో, యవి నాకుఁ జెప్పుము." అని యావృద్ధుఁ డడుగ, ధర్మపుత్రుఁడు స్త్రీ మేజాబల్లను దుడిచినవిధము, కృషకులు చక్రపుపట్టాను వంచినచందము, గొల్లవాండ్రు మంటఁ జేసినపద్ధతి తెలిపెను.

వృద్ధుఁ డేకాగ్రచిత్తముతోఁ జెప్పినది విని కుటీరములోనికి వెళ్ళి యొకగొడ్డలినిఁ దీసికొనివచ్చెను. ధర్మపుత్రునిఁ గుటీరమున కనతిదూరమున నున్నయొక క్షేత్రములోని వృక్షమువద్దకుఁ దీసికొనిపోయి దానినిఁ జూపి "ఈచెట్టును నరికి పడఁగొట్టుము." అని యాజ్ఞాపించెను.

ధర్మపుత్రుఁడు చెట్టును నరకి క్రిందఁ బడవేసినపిదప, వృద్ధుఁడు "ఇప్పు డీవృక్ష స్కంధమును మూఁడుతునకలు చేయుఁడు." అని కోరఁగా, ధర్మపుత్రుఁడు చెట్టును మూఁడుతుండెములు చేసెను. అప్పుడు జ్ఞాని కుటీరములోనికిఁ బోయి నిప్పుఁ దెచ్చి "దీనితో నీమూఁడుతునకలను దగ్ధము చేయుము." అని యాదేశింప, ధర్మపుత్రుఁడు మంటఁ జేసి చెట్టుతునకలను దగులఁబెట్టెను. అవి కాలి కృష్ణవర్ణముఁ దాల్చెను. వృద్ధుఁ డాతునకలను సగమువఱకు వానిచే భూమిలోఁ బాతిపెట్టించి "నీ వాపర్వతము క్రింద నున్నయదినుండి నోటితో జలముఁ దెచ్చి స్త్రీకి బోధించినవిధమున నీదగ్ధకాష్ఠమునకు జలషేకము చేయుము; చక్రికారుల కుపాయము చెప్పినతీరున నీద్వితీయదగ్ధకాష్ఠమునకు జలషేకము చేయుము. గొల్లవాండ్రకుపదేశించినచందమున నీతృతీయదగ్ధకాష్ఠమునకు జలషేకము చేయుము. ఎప్పు డీమూఁడుదగ్ధకాష్ఠములు బ్రదికి చిగిర్చి మూఁడు రేగుచెట్లుగ మాఱునో, యప్పు డమంగళ మేవిధముగ వినాశముఁ జెందునది తెలిసికొనెదవు. అప్పుడు నీపాపమునకుఁ బ్రాయశ్చిత్త మగును." అని చెప్పి తనకుటీరమునకుఁ బోయెను.

ధర్మపుత్రుఁ డెంత యాలోచించినను, ఆయనమాటలమర్మము గ్రహింపఁజాలకుండెను. కాని యే మయినను సరే యని తెంపుఁజేసికొని వృద్ధునియుపదేశానుసారము వాఁడు కార్యనిర్వాహణమునకుఁ గడంగెను.

ఓం పరబ్రహ్మణే నమః

# బ్రాహ్మమతోద్దేశము

## మొదటి ప్రకరణము.

### మత మన నేమి?

ఆదికాలమునుండియు మనుజుఁడు తనచుట్టు నుండుసృష్టివైచిత్ర్యములను జూచి తనలో నుండువిచిత్రమైనవివేచనాశక్తి నుపయోగపఱచి వానితత్త్వమును గ్రహింపఁ బ్రయత్నించుచుండెను. అయినను ప్రతివాఁడును అదేపని చేయుటకు నితరకారణముల వలన వీలుపడనందున కొందఱుబుద్ధిమంతు లాపనికిఁ బూనిరి. అట్లు వారు సమస్తమును విచారించి విచారించి త్రివిధము లైనవిషయములను గ్రహించిరి. అవి ఏవనఁగా;

(1) పంచభూతమిశ్రితమై జడత్వగుణవిశిష్ట మైనయీదృశ్యప్రపంచము;

(2) గ్రాహ్య, జ్ఞాపక, ఆలోచన, ఊహా, కల్పనా, ఇచ్ఛా, దుఃఖానందానుభవ, ఆగామిగోచరజ్ఞానాదిగుణవిశిష్ట మైనమానవబుద్ధి;

(3) పైరెంటియందును అలలయందు సముద్రసలిలముభంగి వ్యాపించియున్న చైతన్య మనఁబడుఆత్మ.

వీనినే సామాన్యముగా (1) ప్రపంచము (2) జీవాత్మ (3) పరమాత్మ యనియు, లేక (1) అచిత్తు (2) చిత్తు (3) బ్రహ్మము, అనియు వాడుదురు.

పిమ్మట్ల, వీనితత్త్వమును, ఒండొంటికిఁ గలపరస్పరసంబంధమును స్వానుభవము వలనఁ దెలిసికొనుటయే జీవితోద్దేశ మని వారు పూర్తిగా గ్రహించిరి. అట్లు తెలిసి కొనుటకు కొన్నిమార్గములను వారు ఏర్పరచియున్నారు. అవి మతము లని పిలువఁబడు చున్నవి.

ఈసందర్భమున మనము ముఖ్యముగా జ్ఞాపకమునం దుంచుకొనవలసినవిషయ మేమనఁగా, పైవిషయములనుగుఱించి జిజ్ఞాస సలిపినవారలు చరాచరాత్మకంబగుసమస్త ప్రపంచమును తమలక్ష్యమునం దుంచుకొనిరి గాని కొంతభాగమును దీసికొని మఱికొంత భాగమును వదలియుండలేదు. అనఁగా వారు కనుఁగొనినమార్గములు సర్వజనులకుపయోగపడవలె నని యుద్దేశము. కాని ప్రపంచము కడువిశాలమైన దగుటచేతను, నానాభాగములయందుఁ గలజిజ్ఞాసకులబోధనలు తత్సమీప దేశములయందే వ్యాపించుటవలనను, మఱియు దేశ, కాల, జ్ఞాన, వేష, భాషాదు లైనయితరకారణములచేతను, పైబోధనలు వివిధములుగా నేర్పడి వివిధమతములకు మూలకారణము లైనవి. కావున ప్రతిమతమునందును రెండువిధము లైనబోధనలు గలవు. అం దొకటి సర్వసామాన్యత్వము (Universalism) రెండవది జాతీయత్వము (Nationalism). ఈరెండును ఉండవలసినవే. అయినను రెండవదానిమూలమున మొదటిదాని ననుసరించుటయే జీవితోద్దేశము. ఏల యన, మతమునకు ముఖ్యాంగ మగుపరబ్రహ్మము ఒక్కటే అయియుండుటచేతను, అదియే సగుణ, నిర్గుణ భావనలచేత సమస్తమునకు మూలధార మగుటచేతను, దానిని దెలిసికొనుటయే జీవితోద్దేశ మగుటచేతను, మత మెప్పుడును సర్వసామాన్యమై యుండకమానదు. కాని దానిని బొంద ప్రయత్నించుటకు మార్గము మాత్రము జాతీయమై యుండును. అనఁగా వారివారిదేశకాలజ్ఞానవేషభాషాదులనుబట్టి యుండును. ఈవిషయము మనము బాగుగ గ్రహించినయెడల లోకములో మతవిషయికము లైనవిరోధము లుండుటకుఁ గారణ ముండదు. అంతటను నెమ్మదియు సర్వసౌభ్రాతృత్వమును స్నేహమును ననుకూల్యమును వ్యాపించియుండును. అట్లు గాక ముఖ్యమైనవిషయమును మఱచి తమమార్గ మొక్కటియే సిక్క మగువాత మని తలఁచి లోకమును చీకాకుపఱచుట మూఢులస్వభావము.

కావున జనులకు మేలు జేయ నుద్దేశింపఁబడినప్రతిమతమునందును పైరెండు లక్షణములును గలవు. కాని కాలక్రమమున జిజ్ఞాసులసంఖ్య తగ్గుచువచ్చినందునను, గొఱ్ఱెదాటు ననుసరించుమూఢులసంఖ్య హెచ్చుచువచ్చినందునను, మొదటిలక్షణ మడుగంటి రెండవలక్షణమే ప్రబలసాగెను. అంతటితో నాగక జనులు ఇంకొకమెట్టు గూడ దిగి జాతీయమతమునందు గూడ పెక్కుభిన్నజాతులను గలిగించి అంతకంతకు మొదటిదియు ముఖ్యమైనదియు నగుసర్వసౌభ్రాతృత్వలక్షణమునకు కడు దూరు లైరి.

ఇట్టిదుస్థితి ప్రపంచమందుఁ గలసర్వమతములయందును గలుగుచుండును. మతమునందుఁ గలయీదుస్థితియే రాజకీయ, సాంఘిక, నైతిక, పరిశ్రామికము లగునితరవిషయములందుఁ గలదుస్థితికిఁ గూడ కారణము. అందువలననే భగవత్ప్రేరితులై అప్పుడప్పుడు జిజ్ఞాసకులు బయలుదేరి యట్టిదుస్థితిని సంస్కరింపఁ బూనుదురు. ఇది స్వాభావికము.

ప్రతిమతమునందును సర్వసామాన్యత్వము, జాతీయత్వము అనురెండులక్షణములు గల వని తెలిసికొంటిమి. ఐనను మత మెప్పుడును సిద్ధాంతమునందు సర్వసామాన్యమై వ్యవహారమునందు పైఁ జెప్పఁబడినట్లు దేశకాలాదు లగుకారణముల ననుసరించి యేర్పడియుండును. మతసిద్ధాంతము లెప్పుడును శాశ్వతములు; సనాతనములు. కాని వ్యావహారిక మగురెండవలక్షణము (జాతీయత్వము) మాఱుచుండును. ఏల యన, జాతీయ మతము మాఱుచుండుస్వభావము గలదేశకాలజ్ఞానవేషభాషాదులస్థితినిబట్టి యుండును. మొదటిలక్షణముయొక్క వ్యావహారికావస్థయే రెండవలక్షణము. శక్తియొక్క పరిణామము, పదార్థమైనట్టి సర్వసామాన్యలక్షణపరిణామము జాతీయ మగుచున్నది. ఈవిషయమును మనము బాగుగా గమనించవలయును. కావున మతమును సంస్కరించఁ దలఁచినవారు మతముయొక్క ప్రధానాంగ మగుసర్వసామాన్యబోధకసిద్ధాంతములను బోధించుచు వచ్చినచో నవి దేశకాలజ్ఞానవేషభాషాదులనుబట్టి తద్దేశజాతీయమతముగా నేర్పడును.

# రెండవ ప్రకరణము.

## మతసంస్కరణ మెట్లుండవలెను?

పైనఁ జెప్పఁబడినవిషయములను బాగుగా విచారించినయెడల మనప్రస్తుతపరిస్థితిగతులనుబట్టి మనదేశమున మన మనుసరింపవలసినవిధి యేదో తెల్లముకాఁగలదు. పైవిషయము లన్నియు మరల నొక్కసారి సంక్షిప్తముగాఁ జెప్పవచ్చును.

(1) ఆదికాలమునుండి జనులలో జిజ్ఞాసువులు దృశ్యాదృశ్య మగుసమస్తమును విచారించి మత మనునొకదానిని నేర్పరచిరి.

(2) ఆమతము సర్వసామాన్యమై, ఒకదేశమునకుఁ గాని, ఒకతెగవారికిఁ గాని మాత్రమే గాక, సర్వమానవసముదాయంబునకు సంబంధించినదై యుండెను.

(3) కాని సర్వసామాన్య మగునామతము దేశ, కాల, జ్ఞాన, వేష, భాషాదులనుబట్టి భిన్నదేశములయందు భిన్నరూపములుగా నేర్పడి జాతీయమతము లన బరగెను. కావున ప్రతిమతమునందును పైరెండులక్షణములును గలవు.

(4) మత మనునది ఆధ్యాత్మిక మైనదిగనే యనుకొనఁబడుచున్నను, మతమును బట్టియే రాజకీయసాంఘిక నైతికపరిశ్రామికము లగునితరవిషయములలోనిమార్పులు మనకు దెలిసియో తెలియకయో యేర్పడుచుండును.

(5) కావున, మానవునిజీవితోద్దేశ మగుసకలవిషయములయభివృద్ధికి మూలబీజ మగుమతమును సుస్థితియం దుంచుకొనుట పరమవిధి.

(6) మతసిద్ధాంతములు సర్వసామాన్యము లైనను, వ్యావహారికమునందు జాతీయములై యుండక వీలు లేనందునను, జాతీయములు దేశకాలాదులస్థితులనుబట్టి మాఱుచుండుటవలనను, అట్టిమార్పులను గమనించుచు సర్వసామాన్యలక్షణబోధనలను వెదజల్లుచు వచ్చినయెడల, దేశ మభివృద్ధి గాంచును.

కావున ప్రస్తుతము మనము తెలిసికొనవలసినసమాచారము లే వనఁగా:—

(1) ప్రస్తుతప్రస్థితిగతు లేవి? (2) జాతీయమత మెట్లుగా నుండును? (3) సర్వసామాన్యలక్షణబోధ లన నేవి? అనునవి.

ప్రస్తుతప్రస్థితిగతులు సర్వజనులకుం దెలిసినవిషయమే గనుక వానినిగూర్చి విశేషించి చెప్పవలసినయావశ్యకత యుండదు. ఈవఱకు మనదేశముయొక్కస్థితి ప్రస్తుతపురీతిగా నుండనప్పుడు విశేషించి ఒకేజాతివారు నివసించుచుండినందున వారిమతము ఒక్కటిగా నుండి "హిందూమత" మన బరగెను. అట్లుండియు పేరునకును వ్యావహారికమునందును ఒకనిబంధనవు లోఁబడినట్లు "హిందూమత" మన బరగినను, మతముయొక్కముఖ్యలక్షణము లగుసర్వసామాన్యబోధకసిద్ధాంతము లైనసనాతనధర్మముల గలిగి యుండెను. కాని కాలక్రమమున తత్సిద్ధాంతములు మఱుగుపడి వ్యావహారికస్థితి నిలిచియున్నది. పూర్వకాలమున వ్యావహారికస్థితి నిలిచియున్నను బాధకము లేకపోయెను. కాని యిప్పుడు దేశస్థితి మాఱి యితరజాతులవారును మనదేశమున జేరుటవలన భిన్నరూపములగువ్యావహారికస్థితులవలన, కొంత భంగము కలుగకమానదు. దీనికి ముఖ్యకారణము సర్వమతములకు సామాన్యము లగుసనాతనసిద్ధాంతములను మఱచిపోయి వ్యావహారికస్థితులే ముఖ్య మైన వని భావించుటయే. మనదేశమున ప్రస్తుతప్రజాతీయవిజృంభణము మనదేశమున నున్న హిందూ, మహమ్మదీయ, క్రైస్తవజాతులను సమన్వయించి క్రొత్త యిండియాదేశజాతి (Indian Nation) యేర్పరుపఁ బ్రయత్నించుచున్నది. ఇది మాత్రమే గాక హూణకళాప్రభావమున మనము ప్రపంచమునఁ గలసర్వజాతులవారితోడను సంబంధమును గలుగఁజేసికొనుచున్నాము. కావున స్నేహము, సర్వసౌభ్రాతృత్వము పెంపొందవలసినయావశ్యకత యున్నది.

అట్టిది సర్వమతసామాన్యము లగుసనాతనసిద్ధాంతబోధనలవలననే కలుగును గాని వ్యావహారికము లగుజాతీయము లనఁబడుచున్నబోధనలకు ప్రాముఖ్యము నిచ్చినచో కలతలు మెండగును. ఇది తగదు. అయినను మన మెంత సర్వసామాన్యసిద్ధాంతములను బోధించుచున్నను, వ్యావహారికమునందు భిన్నజాతులవారికి భేదము లుండకమానవు. ఉండియే తీరవలెను. ఏల యన, మతసిద్ధాంతము లనుసరించువాఁడు తన దేశకాలజ్ఞానవేషభాషాదులస్థితులనుబట్టియే యనుసరించవలయును. అట్టిస్థితులను వివిధజాతులవారు

వివిధముగాఁ బొందియున్నారు. కావున వ్యావహారికమున భిన్నజాతులవారు భిన్నమతము లవలంబించునట్లు గాన్పించినను, సర్వసామాన్యసిద్ధాంతములయందు మనస్సు లగ్నపరచుచుండవలయును. ఇదియే ప్రస్తుతమున సర్వమతములయందుఁ గావింపఁబడుచున్నసంస్కరణము. క్రైస్తవమతమున యూనిటేరియన్ మతమును, మహమ్మదీయమతమున బాహాయ్ మతమును, ఇట్లె బౌద్ధమతమునఁ గూడ నొకనవీనమతమును బుట్టి ఆయాజాతీయమతములయొక్క సనాతనధర్మములను బోధించుచు వానిని సంస్కరించుచున్నవి. మనహిందూమతమునఁ గూడ ప్రస్తుతస్థితిగతుల ననుసరించి విద్యాధికులును, జిజ్ఞాసువులును కొందఱు బ్రాహ్మసమాజమత మనుపేర హిందూజాతీయమతముయొక్క సనాతనసిద్ధాంతములను బోధించుచు, హిందూమతమును సంస్కరించుచున్నారు. అయినను ప్రస్తుతపుస్థితిగతులనివార్యము లైనందున, పైఁ జెప్పఁబడిన యూనిటేరియన్, బాహాయ్, బ్రాహ్మసమాజమతము లనుపేరఁ గాకున్నను, దేశహితైకకార్యనిరతు లగుపెక్కండ్రు పైసంస్కరణములకు సాహాయ్యపడుచున్నారు. అనఁగా మతసంస్కరణము చేయువారు జాతీయపద్ధతులనే యనుసరించి ప్రస్తుతపుదేశకాలాదులస్థితులకుఁ దగినట్లు సర్వసామాన్యసిద్ధాంతములను బోధించుచున్నారు. ఇదియే సరియైనమార్గము. ఇట్లు జరుగుచున్నను కొందఱు ఆనూతనమతములనుగుఱించి దురభిప్రాయములను గలిగియున్నారు. అవి పోఁగొట్టవలసినయావశ్యకత విద్యాధికులయం దున్నది.

## బ్రాహ్మసమాజప్రమాణపత్రము.

ఇదివఱలో దేవేంద్రనాథుఁడు వేదాంతికప్రమాణపత్రిక నొకదాని నేర్పాటుచేసి యుండె నని వ్రాసియుంటిని. ఇప్పుడు దానికి బదులుగ స్వాభావిక మైనట్టియు, సర్వసమ్మత మైనట్టియు ఆస్తికమతసిద్ధాంతములు గలనూతనప్రమాణపత్రిక నేర్పాటు చేసెను.* దాని నీక్రిందఁ బొందుపరచుచున్నాను.

ఓం

నేఁటికి సరియైన—వసంవత్సరము—వనెల—వతేదీని నే నిందుమూలమున బ్రాహ్మమత మవలంబించుచున్నాను.

1 సృష్టికర్తయు, రక్షకుఁడును, నాశకుఁడును, ముక్తిని ప్రసాదించువాఁడును, సర్వజ్ఞుఁడును, సర్వవ్యాపియును, ఆనందమయుఁడును, నిరాకారుఁడును, అద్వితీయుఁడును, నగుపరమేశ్వరుని ప్రేమించుచు, నతనికిఁ బ్రీతికరము లగుకార్యములు చేయుచు, వారాధన చేయుచుందును.

2 సృజింపఁబడినయేపదార్థమును గాని సృష్టికర్తగా దలచి నేను పూజింపను.

3 నాకు దేహములో వ్యాధి కలిగి శక్తి లేక యున్నపుడును, లేక యేదియేని విపత్తు సంభవించినప్పుడును దప్ప, నేను ప్రతిదినమును పరమేశ్వరుని ప్రేమాగౌరవములు గలహృదయముతోఁ బ్రార్థింపక యుండను.

4 సత్కార్యములను జేయుటకుఁ సర్వదా ప్రయత్నింతును.

5 నీతిబాహ్యా మైనపాపకార్యములను వర్జించుటయందు నేను జాగరూకతఁ గలిగియుందును.

6 విషయప్రాబల్యముచే నే నేపాపకార్యముల నైనను జేయునపుడు పాప విమోచనముకొఱకై పశ్చాత్తాపముపడి యిఁకముం దట్టిదుష్కార్యములను మరలఁ జేయ కుండుటకై ప్రయత్నముఁ జేయుదును.

7 బ్రాహ్మమతాభివృద్ధికై ప్రతివత్సరమును బ్రహ్మసమాజమునకు శక్తికొలఁదిని దానము చేయుచుందును.

ఓయీశ్వరుఁడా! ఈబ్రాహ్మమతధర్మముల ననుసరించి ప్రవర్తించుటకుఁ దగిన శక్తిని నాకుఁ బ్రసాదింపుము.

## సమాజమునందలి మార్పులు.

తత్త్వబోధినీపత్రికాముఖమున సహజమతప్రధానసిద్ధాంతమును దెలియఁజేయు నీక్రిందియర్థము నిచ్చుయుపనిషద్వాక్యము సమాజమునం దీగొప్పమార్పు గలిగినందునకు సూచనగాఁ బ్రచురింపఁబడుచుండెను.

“ఏవిద్య నిత్యమును నిర్వికల్పము నగుపరమాత్మను పొందఁ గలుగఁజేయుచున్నదో, అదియే సర్వోత్కృష్టమైనది. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము, శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము, యి వన్నియు నికృష్టమైనవి.

సమాజమునందు పోరాటము లన్నియు పూర్తిగా నశించి యంతయు స్థిరపడిన యనంతరము 1850 వ వత్సరమున సమాజసంవత్సరోత్సవము మిక్కిలి యుత్సాహముతో జరుపఁబడెను. సమాజమందిరమునకు సుందరమైనచలువరాతివేదికను గలిగియున్న మూడవయంతస్థు చేర్పఁబడుటయే యీయుత్సాహమున కొక ప్రత్యేకమైనకారణము. ఈసంవత్సరోత్సవము మఱియొకప్రధానాంశమునకుఁ గూడ కారణ మయ్యెను. ఇంతవఱకును సమాజముయొక్క జీవితము జ్ఞానబోధకముగను వేదాంతికముగ నుండెను గాని భక్తిబోధకమై యుండలేదు. ఈలోపమును రాజనారాయణబోసు దేవేంద్రనాథునకు సూచించుచుండెను. ప్రాన్సుదేశక్రైస్తవమతప్రధానాచార్యుఁ డగు ఫినిలోమచే వ్రాయఁబడినప్రార్థన నొకదాని ననువదించి యీసంవత్సరోత్సవమున రాజనారాయణబోసు చదివెను, ఇది సమాజోపాసనల కొకనూతనాభినివేశమును గలుఁగజేసెను.

1850 వ వత్సరము మొదలు 1858 వ సంవత్సరమువఱకు ప్రాచీనబ్రాహ్మమతము మార్పు పొందినకాల మని చెప్పవచ్చును. వేదము లమోఘములైనవి కా వని స్థిరీకరింపఁబడిననాఁటినుండి బ్రాహ్మసమాజమునందలియౌవనసభ్యులు నూతనసాంఘికభావనలను బ్రాహ్మమతమునఁ జొప్పించుటయు దానిపునాదిని బలపరచుటయు గాక దానిప్రధానసిద్ధాంతములను గూడ తర్కింప మొదలుపెట్టిరి. వీరలకు అక్షయకుమారదత్తు నాయకుఁడుగ నుండెను. ఈనూతనజీవనము బ్రాహ్మసమాజమునందుఁ గలిగినట్లు తత్త్వబోధినీపత్రికయందుఁ గాననగుచుండెను. అందు స్త్రీవిద్య నామోదించుచు, వితంతువివాహముల ప్రోత్సాహపరచుచు, మద్యపానము నిషేధించుచు, బహుభార్యాత్వము నిరసించుచు, బ్రాహ్మమతసిద్ధాంతముల సహేతుకము లగునట్లు చేయఁ బ్రయత్నించుచు, బ్రాహ్మమందిరవ్యవహారములు సరియైననిబంధనలనుబట్టి నడపఁబడునట్లపేక్షించుచు పెక్కువ్యాసములు వెలువడుచుండెను. సాంఘికవిషయములగూర్చి దేవేంద్రనాథునియభి

ప్రాయములు యౌవజనపక్షమువారియభిప్రాయములతో పూర్తిగా నేకీభవింపకుండెను. అయినను నాతఁడు వారిని దనచేతిలో నుంచుకొన శక్తియుక్తులఁ బ్రయత్నించెను. అట్లు చేయుటయందు సమాజనావ ముందు రానున్నగోంపిలో దిగబడకుండునట్లు బహునేర్పుతోను జాగరూకతతోను నడపించెను. ఆతఁడు యౌవజనపక్షము వారిక్రమమయిన నివేదనలకుఁ జెవియొగ్గి వారి క్రమమైన యభిలాషలను ప్రోత్సాహపరచుచుండెను. తత్వబోధినీపత్రికానిర్వాహణమును దానిసంపాదకునకును దానినిర్వాహకసంఘమునకును విడిచిపెట్టి తాను సమాజముయొక్క యాత్మీయ సంబంధమైనకార్యములకుఁ బూనుకొనెను. మఱియు, నాతనిప్రోత్సాహమువలన కలకత్తాలోను తత్సమీపముననను ననేకసమాజములు బయలుదేరెను. బీహాల, కిడ్డరపురము, భవానీపురము, బర్ద్వాను, కృష్ణనగరము మొదలగు పెద్దపట్టణములందు సమాజము లుత్పత్తి యయ్యెను. బీహాల భవానిపురములందలిసామాజికులు బ్రాహ్మమతవ్యాప్తికై రెండు సంఘముల నేర్పాటుచేసిరి. బర్ద్వానుదేశప్రురాజగు మహారాజ అధిరాజ మహాతబుచంద్ర బహదూరుగారు తమమందిరముననే విద్యావంతు లగుముగ్గురుపండితులసాహాయ్యముతో నొకసమాజము స్థాపించెను. దేవేంద్రనాధుఁడు తానుస్వయముగ నాయాస్థలములకు జని ప్రోత్సాహకరము లగునుపన్యాసముల నిచ్చి యాయాసమాజములకుఁ దోడ్పడుచు, బ్రాహ్మమతమును వ్యాపింపఁజేయుచుండెను.

కలకత్తాబ్రాహ్మసమాజమునందు మాత్రము దేవేంద్రనాధునకును అక్షయకుమారదత్తుపక్షమువారికిని పోరాటములు కలుగుచుండెను. అక్షయకుమారదత్తు "ఆత్మీయసభ" యను నొకసంఘము నేర్పరిచెను. ఆదియందది సాంఘికసంబంధమైన విషయముల జర్చించుటకై యేర్పడినను, తుదకు దానియందు బ్రాహ్మసమాజముయొక్క ప్రధానసిద్ధాంతములే చర్చింపఁబడుచుండెను. అందఱిసాంఘికు లీశ్వరగుణములగూర్చి తమలోనివారి యొక్కువమంది యభిప్రాయములఁ గైకొని స్థిరపరచుకొనుచుండిరి. ఈమిత్రకూటమునుగూర్చి దేవేంద్రనాధుఁడు తనస్వీయచరిత్రమునం దీరీతిఁ జెప్పియున్నాఁడు. "అక్షయకుమారదత్తు ఒకమిత్రకూటమును స్థాపించెను. దానియందు చేతులనెత్తి యొన్నుకొనుటవలన ఈశ్వరగుణములు స్థిరపరుపఁబడుచున్నవి. ఎట్లన, ఎవరయినను "ఈశ్వరుఁడు ఆనందముయొక్కమూర్తిభావముగునా కాదా!" యని ప్రశ్నించిన, నెవ్వరెవ్వ రాతనిబ్రహ్మానందత్వమును నమ్ముచున్నారో, యట్టివారు

తమచేతుల నెత్తుచుండిరి. ఈరీతిగా బాహుళ్యముమీఁద వారివారియభిప్రాయములు గైకొనఁబడి ఈశ్వరగుణములనిజానిజములు పరిష్కరింపఁబడుచుండెను.'' మిత్రకూటము వారియిట్టిచర్యలు దేవేంద్రనాధున కసహ్యము గలుగఁజేయుట స్వాభావికము. దేవేంద్రనాథుఁడు సిమ్లాపర్వతములందు నివాస మేర్పరచుకొనుట కిదియొక కారణ మని యాతఁడు తనస్వీయచరిత్రయందు వ్రాసియున్నాఁడు. అచ్చట నాలోచించుటకును, చక్కఁగ విచారించుటకును, ధ్యానించుటకును, ప్రార్థించుటకును, సమాజమునందు స్వాభావికముగా నూతనముగ జనించినమార్పులను చక్కఁగఁ బరిశోధించుటకును తనకాలమును పూర్ణముగా వినియోగపరుపవచ్చు నని యాతఁడు తలంచెను. గృహము నందలియాపదలతోను మందిరమునందలిపోరాటములతోను వ్యాకులతను జెంది 1856 వ సంవత్సరమున నాతఁడు సిమ్లాపర్వతములందు నివసించుటకై వెళ్ళెను. అందుఁ దనకాలమును ధ్యానమునందును ప్రార్థనయందును హిందూఆంగ్లేయపారశీక వేదాంతుల గ్రంథముల పఠించుటయందును గడపుచుండెను. వేదములయమోఘత్వమును విసర్జించుటచే గలిగిననూతనావస్థను సాధించుటకై ప్రయత్నించుచుండెను. వేదములను విశదీకరించునది మతము గాని, మతమును విశదీకరించునవి వేదములు కావనుస్వాభావికాస్తికమతసిద్ధాంతము నాతఁడు గ్రహించెను. ఇదియే ఆతఁడు చేసినకృషియొక్క పర్యవసానము.

## అక్షయకుమారదత్తు వ్యాధిగ్రస్తుఁ డగుట.

అక్షయకుమారదత్తుశరీరమున 1855 వ సంవత్సరమున నొకభయంకరమైనవ్యాధి జనించి యాతనియుద్యమములకు భంగము గలిగించెను. ఆతఁడు తత్త్వబోధినీపత్రికా నిర్వహణమును మానుకొనవలసివచ్చెను. అందుచే నవీనచంద్రబెనర్జీ యను నాతఁడు అందునకు బూనుకొనెను. అక్షయకుమారదత్తు ఈవ్యాధినుండి మరల స్వస్థత జెందలేదు. ఆతఁడు కడను బ్రాహ్మసమాజముతో సంబంధించినసమస్తకార్యములను విడిచిపెట్టవలసి వచ్చెను. అక్షయకుమారదత్తు వ్యాధిపీడితుఁడై సమాజమునుగూర్చి పనిచేయలేకపోయినను మిత్రకూటమునందలి యితరయావనసాంఘికులు మాత్రము పాటుపడుచుండిరి. అక్షయ కుమారదత్తు ప్రారంభించినసంస్కరణమునకు వారు పూనుకొని కడకు బ్రాహ్మసమాజము నుండి వేఱుపడిరి. అదృష్టవశమున నీభేదము శాశ్వతముగ నుండక 1866 వ సంవత్సరమున సంభవించినయాగొప్పభేదములోఁ గలిసిపోయెను. దానిని గూర్చి యిఁక ముందు వివరింపఁబడును.

విద్యావంతు లెల్లరు ఏల సంస్కర్తలు కాఁగూడదు? సంస్కర్త లేమైన దుష్కృత్యముల జేయుచున్నారా? లేక దుర్బోధల బోధించుచున్నారా? వారియాదర్శములయం దేమైనలోప మున్నదా? వారు నడచుమార్గమునం దేమైనతప్పు లున్నవా? సంస్కరణపక్ష మిప్పు డవలంబించుచున్నవారిలోను, ఇదివఱ కవలంబించినవారిలోను ప్రఖ్యాతిగాంచినహిందూమహాజనులు లేరా? రామమోహనరాయలు, విద్యాసాగరుఁడు రానెడి, రమేశచంద్రదత్తు, బంధార్కరు, చందవార్కరు, గోక్లె, మొదలగువారు సామాన్యులా? చక్కఁగ పరిశీలించి చూచితిమేని సంస్కర్తలయాదర్శములు మహోన్నతము లని స్పష్టపడకమానదు.

సంస్కర్తలప్రధానాదర్శము (Ideal) సంఘము నభివృద్ధిజేయుట. పూర్వాచారపరాయణుల కిట్టియాదర్శములు లేవు. హిందూసంఘము చెందఁదగినయభివృద్ధి యిదివఱకె (కృతయుగమునందు) చెందిన దని వారినమ్మకము. ఇప్పు డొకవేళ సంఘమునందు దురాచారము లుండెనేని యవి కలియుగమహాత్మ్య మనియు, మనుష్యమాత్రుల మగు మనము వీనిని నశింపఁజేయఁజాల మనియు, ఒకవేళ చేయఁగలిగినను దానికి తగినమార్గము ప్రాచీనధర్మముల దేశమునందు వ్యాపింపఁజేయుటయే గాని మఱియొకటి లే దనియు వారిదృఢాభిప్రాయము. సంస్కర్తలయుద్దేశము వేఱుగ నున్నది. హిందువు లొకప్పుడు మహోన్నతపదవిని బొందియుండిరి. వారిఆదర్శములును ఆచారములును మిక్కిలి ఆదరణీయములై యుండినవి. క్రమక్రమముగ కారణాంతరములచే నివి యన్నియు నశింప సంఘమునం దనేకదురాచారములు ప్రబలినవి. వీనిని నశింపఁజేయుట యిప్పుడు కర్తవ్యము. ఈకార్య మొనర్చుటయందు పూర్వు లేల యున్నతపదవిని బొందియుండిరో తెలిసికొనుట అత్యావశ్యకము. ఇది ఆవశ్యకమైనను పూర్వులు చేసినదే మనము చేయుటయు, వారిఆదర్శములే మనకు ఆదర్శములుగ నుండవలయు ననుటయు, వారి ధర్మములే మనకు ధర్మములుగ నుండవలయు ననుటయు, అసంగతము. ఏలన, సంఘము భివృద్ధి చెందవలయు నేని ఆదర్శములు (Ideals) మాఱుచుండవలయు. మార్పన, ఉన్నతాదర్శముల విడనాడి, యధమాదర్శముల స్వీకరించుట కాదు. ఉన్నతతరమైన ఆదర్శముల సంపాదించుటయే. మనపూర్వులు అంగీకరించినఆదర్శములలో కొన్ని యుత్తమము లయినవి కావు. వానిని విడనాడవలయును; మఱికొన్ని నవీనాదర్శముల మనపూర్వులు

కలిగియుండకపోయినను మనము స్వీకరించవలయును. ఏలన, కాలము మాఱినది. ప్రపంచతత్త్వము మాఱినది. మనపూర్వు లుండినస్థితియందు మన మిప్పుడు లేము.

సంఘాభివృద్ధి యన ఆదర్శములు లేనిచోట వానిని తెచ్చిపెట్టుట; అధమాదర్శములకు బదులుగ ఉత్తమాదర్శముల స్వీకరించుట; కాలానుగుణముగ నవీనాదర్శముల సంపాదించుకొనుట. ఇట్టిఆదర్శముల నెదుట నుంచుకొని వానిప్రకారము నడచుకొనుటయే సదాచార మనఁబడు. ఈవిషయము ప్రపంచచరిత్రములోనికొన్నిఉదాహరణములు స్పష్టపరుపఁగలవు. ప్రారంభయుగమున ప్రతిదేశములోనివారును ప్రధానముగఁ జేయవలసినకార్యము తమశత్రువులతో యుద్ధమే. ఆహారమును సంపాదించుకొనుటయందును, రాష్ట్రముల వృద్ధిజేసికొనుటయందును, దినదినము యుద్ధ మావశ్యకమై యుండెడి. అట్టికాలమున, యుద్ధమునందు విజయము సంపాదించుకొనుటయే ప్రతిమనుజునిఆదర్శమై యుండెడి. దీనికి తోడుగ, యోధులు, రణరంగమున స్వపరాక్రమమును జూపినశూరులు సంఘమునందు గౌరవింపఁబడుచుండిరి. దీనిని క్షాత్త్రయుగ మని చెప్పవచ్చును. ఇట్టికాలమునందలియాదర్శములు క్షాత్త్రాదర్శములు (Military ideals) అని చెప్పవచ్చును. వేదయుగమందు మనవారు అనార్యులతో యుద్ధమును గావించుటయే దినచర్యలలో ప్రధానముగ అంగీకరించిరి. కావుననే వారు దేవతల ప్రార్థించుటయందు పరాక్రమశాలు లగుపుత్త్రుల నియ్యవలసిన దని కోరుచుండిరి. ఇట్లు క్రమక్రముముగ కాలము మాఱి, ఆర్యులు దేశమునంతయు నాక్రమించిరి. రాజ్యములు స్థాపింపఁబడియె; శత్రువులబాధ తగ్గెను; అట్టిసమయమున యుద్ధముజేసి రాజ్యమును సంపాదించుటకంటె, ఇంద్రియముల వశపరచుకొని ఆముష్మికసుఖమును బొందుటయె ఘనాదర్శ మని యెల్లరు తలఁచిరి. ఈకారణముచే ప్రభువులు యుద్ధవీరులు మొదలగువారికంటె ఇంద్రియనిగ్రహము గావించి, తపస్సంపన్ను లని ప్రఖ్యాతిగాంచినవారలనే ప్రజలెక్కువగ గౌరవించుచుండిరి. ఇట్లె యితరదేశచరిత్రముల పరిశీలించితిమేని ఆదర్శములప్పుడప్పుడు మాఱుచుండిన వని తెలియుచున్నది. సంఘ మెట్టిస్థితిలో నున్నదో తెలిసికొనఁగోరితిమేని, ప్రజలఆదర్శము లెట్టివియో తెలిసికొనుట ఆవశ్యకము. ఇట్లు మనపూర్వు లభివృద్ధిగాంచుటలో తమఆదర్శముల కాలానుగుణముగ మార్చుకొనుచుండిరి. తుదకు కొంతకాలమునకు మనవారు చైతన్యవిహీనులై క్షీణింపఁదొడఁగిరి. ప్రస్తుతకాలమునందు మన మెల్లర మిట్టిదుస్థితియం దున్నాము. మన కట్టియాదర్శములును లేవు.

మనపూర్వులఆదర్శముల మఱచితిమి. మనజనసామాన్య మెట్టియుద్దేశములను గలిగి యుండక తమజీవితకాలమును గడపుచున్నారు. పుత్త్రుల గోరుతలిదండ్రు లెట్టిపుత్త్రుల గోరుచున్నారో చూడుడు. పరాక్రమవంతులను బ్రహ్మవిద్యాపారీణులను మనపూర్వు లాయాకాలములయందు గోరుచుండిరి. ఇప్పు డన్ననో ఒకజడ్జియో, లేక పోలీసు యిన్స్పెక్టరో, ఒకతహసీల్దారో కాఁదగినపుత్త్రులను మనవారు కోరుచున్నారు. ఇది యొకగొప్పఆదర్శ మందుమా? ఆంగ్లేయులు రాజ్యమును విస్తరింపఁజేయుటయందు సమర్థులగుపుత్త్రుల గోరుచున్నవారు కారె? జర్మనులు యోధులగుపుత్త్రులను, అమెరికనులు స్వతంత్త్రమును వ్యాపించుపుత్త్రులను కోరుచున్నవారు. ఇట్లు ప్రపంచమునం దొక్కొకదేశమందును నవీనోద్దేశములు ప్రబలి ప్రజ లభివృద్ధిజెందుటలో సాయపడుచుండ మన మెంతటిదుస్థితియం దున్నాము? మనోబలము, శరీరబలము నశింప, 'ఏగియో యొక భగవంతుఁడు నాసమ్మతము లేనిదెయొ న న్నీప్రపంచమునందు బుట్టించె, పుట్టితిని; ఏదియో యొకవిధమున జీవయాత్రజేసి మృతిజెందెదను' అని తలంచుచు మనము కాలమును గడపుచున్నాము. ఇట్టిమనసంఘము క్షీణత బొందుచుండలే దని చెప్పుటకు సాహసించువాఁ డొకఁ డైనఁ గలడా?

సంస్కర్తలు జేయుచుండుకార్య మెద్ది? సంఘము క్షీణించుచున్న దని తీర్మానము జేసినవారై దానిని తగుమార్గమున నుద్ధరించుటకు సర్వప్రయత్నముల గావించుచున్నారు. దేశములోనిప్రజ లెల్లరు తమశౌర్యపరాక్రమములను, తమశరీరమనోబలములను వృద్ధి జెందించుకొని సంఘీభావముతో పనిచేయవలయు ననియు, ఇతరదేశస్థులవలె మనవారును ఐశ్వర్యవంతులై సర్వసంపదలు గలిగి సమస్తఐహికసుఖముల బొందవలయు ననియు, ఆంగ్లేయసామ్రాజ్యమునందలి కాలనీ లనుభవించుచుండు రాజకీయవైభవమును మనవా రనుభవించునట్లు గావింపవలయు ననియు, సంస్కర్తలయుద్దేశములై యున్నవి. ఇట్టిఘనోద్దేశముల దేశమునందు వ్యాపింపఁజేసి వానిని నెరవేర్చుకొనుటకు తగినమార్గముల కనిపెట్టుటకై సంస్కర్తలు పాటుపడుచున్నారు. సంస్కర్తలు చేయుటయం దేమియు క్రొత్త దగుపడుటలేదే? వారిఆదర్శములయందు నవీనము లేమియు లేవే? దేశాభివృద్ధిని పూర్వాచారపరాయణులు మాత్రము కోరుటలేదా, అని కొంద రడుగవచ్చును. ఎవరెవరు దేశాభివృద్ధిని కోరి దానికి తగువిధమున పాటుపడుచున్నారో, వారెల్లరు సంస్కర్తలే. సంఘమునందు ఘనాదర్శములు లే వనియు, వానిని సంఘమున ప్రవేశపెట్ట

వలయు ననియు నమ్మువా రెల్లరు సంస్కర్తలే. ఒకవిషయము మాత్రము మన మెప్పుడు మఱువకూడదు. ఏలాగున మన మొక గ్రామమును చేరఁదలచుకొనిన, పూర్వమువలె సామాన్యమైనబండ్లయందు ప్రయాణముజేయక రైలుబండ్లయందు ప్రయాణముజేయు చున్నామో, ఏలాగున రాజ్యమునందు న్యాయమును స్థాపించుటకు శూద్రునకును బ్రాహ్మణునకును ఒకవిధమైనశిక్షను వేయుట కంగీకరించి ప్రాచీనధర్మశాస్త్రములయందు మార్పుల గావించితిమో, ఏలాగున నిప్పటి కాలానుగుణముగ బ్రాహ్మణులు కూడ బ్రాహ్మణేతరులప్రాచీనవృత్తు లవలంబించుటవలన ధర్మవిరుద్ధ మేమియు లే దని సమ్మతించితిమో, అట్లే మనలౌకికాచారములయందు కాని, మనమతాచారములయందు కాని మార్పు లవసర మని తోఁచినపుడును, మార్పులవలననే మనము వృద్ధిజెందెద మని మనము నిశ్చయముగ నమ్మితిమేని శాస్త్రము లేమి ఘోషించినను ఘోషించనిండు; పురాణము లేమి విధించినను విధించనిండు. తమకు కావలసినమార్పుల జేసికొని పూర్వకాలమున తమయాదర్శముల సఫలీకృతముల గావించుకొనుటకు పూర్వులు శాస్త్రముల నెట్లు విధించుకొనిరో, మనమును మన కనువైనశాస్త్రముల విధించుకొనుటయందు ధర్మవిరుద్ధమేమియు లే దని తీర్మానముగ నమ్మవలయును. కావున సంఘ మభివృద్ధిగావలె ననియు, దీనికై మనము మార్పుల నెన్నియో చేసికొనవలయు ననియు స్పష్టమగుచున్నది.

కాలము మాఱుచున్న దనియు, ఆదర్శములును యుద్దేశములును కాలానుగుణముగ మార్పును జెందుచున్న వనియు చెప్పఁబడియె. ఈమార్పుల కన్నిటికిని కర్త యెవరు? కాలము, ఉద్దేశములు, ఆదర్శములు తమంతట తాము మార్పును జెందుచున్నవా? కాల మహిమ యని మనము చెప్పుచుందుమే! ఈమహిమను కల్పించుమహానుభావుఁ డెవడైన నున్నాడా? లేక మహానుభావులయావశ్యకత లేకయే సమస్తమును మార్పు చెందుచున్నదా? ఈవిషయముల కనువగునట్టియు, ఎల్లరికిని తృప్తికరములయినట్టియు ప్రత్యుత్తరముల నిచ్చుట మిక్కిలి కష్టతరము. అయినను ఒకఅంశమును మాత్రము సత్య మని చెప్పవచ్చును. ప్రపంచమునందు జరుగుచుండుమార్పుల కెల్ల కర్తయు కారణభూతుఁడును మానవుఁడే. కాలము మాఱుచున్న దని కాలమునం దేదియో మహిమ యుండునట్లు మనము సామాన్యముగ జెప్పెదము కాని, కాలమునం దీమార్పుల గావించువాఁడు మానవుఁడే. మానవునిశక్తిసామర్థ్యము లింతటివి యని చెప్ప సాహసించువాఁ డెవఁడు కలఁడు? మృగములకంటె హీనదశయం దుండి, నిరాయుధుఁడై, భాషావిహీనుఁడై

ఆహారసంపాదనాశక్తి లేక, సమస్తకష్టముల పాలగుచుండినబహుప్రాచీనయుగమందలి అడవిమనుష్యుఁ డెక్కడ? ప్రకృతిలోనిరహస్యములఁ దెలిసికొని ప్రకృతిలోనిసమస్త శక్తులను వశపరచుకొని సమస్తవైభవసంపన్నుఁ డైన ఇరువదవశతాబ్దపుమనుష్యుఁ డెక్కడ? ఎంతతారతమ్యము? మనుష్యుఁ డెంతజయశీలుఁడు! ఎన్నిఘనకార్యముల గావించె? నిప్పు మొదలు ఆకాశయానములనఱకు ననేకచిత్రవిచిత్రసామగ్రిని కనిపెట్టఁ గలిగినమానవునిశక్తి యే మనవచ్చును? మానవుఁ డీప్రపంచమునం దింకను ఏమి చేయు నున్నాడో! మనుష్యుఁ డిట్టివిస్మయకరము లగుకార్యములఁ జేయుటవలన కదా, సంఘ మభివృద్ధి జెందుచుండుట. కాలమహిమ యని మన మాలోచింపక సాధారణముగ చెప్పు చుండినను కాలమునం దీమహిమను గల్పించి ప్రపంచ మభివృద్ధిగాంచునట్లు చేయువాఁ డొకమానవుఁడే.

సంఘసంస్కరణమునకును, ఈఅంశమునకును గలసంబంధ మేది యని అనేకు లడుగవచ్చును. సమాధానమును వినుఁడు. ఇంతటిమహాశక్తి మనుష్యున కున్నను, దానిని మఱచి ప్రతివాఁడును ప్రధానముగ మనసంఘమునం దనేకనిబంధనలకు కట్టుపడియు న్నాఁడు. తనసుఖదుఃఖములకును తనవృద్ధిక్షయములకును కర్త తానే గనుక, శాస్త్రము లేమి చెప్పినను, పెద్ద లేమి చెప్పినను వినవలసినదే కాని, వినినంతమాత్రముచేతనే తన యంగీకారము నిచ్చి తాను తలయూచుటకన్న పాపకార్యము వేఱొకటి లేదు. తనమన స్సునకు మంచి దనియు సత్య మనియు నమ్మకమును కలిగించుకొనుట ప్రతివానిఅగ్రకృ త్యములలో నొక్కటిగ నున్నది. దీనినే సంస్కర్తలు బాగుగ నొక్కి వక్కాణించు చున్నారు.

దీనినుండి విశదమగువిషయ మేమి యన, ప్రతివాఁడును ప్రతివిషయమును గుఱించియు సాధ్యమైనంతవఱకు యుక్తాయుక్తవిచారణ జేసి తనకు బాగుగ యుక్త మని తోచినమార్గమునఁ బోవుటకు ప్రయత్నించవలయును. కావున ప్రతివాఁడును స్వాతంత్ర్యము సంపాదింపవలయును. స్వాతంత్ర్య ముండినపుడే ఇది యుక్త మనియు, ఇది అయుక్త మనియు నిశ్చయించుట కవకాశ ముండఁగలదు. అట్లు గాక స్వాతంత్ర్య పోఁగొట్టుకొని యితరులవాక్యము లన్నియు యుక్తము లని నమ్మినయెడల కన్ను లుండి యు వానిని మూసికొని వానిని యుపయోగింపక ప్రవర్తించుమనుష్యునివలె నగు దుము. సంఘ మభివృద్ధిగాంచవలయు నేని సంఘములోనివారెల్ల స్వాతంత్ర్య గలిగి

యుండవలయును. వివేకశూన్యులమై యుండునపుడు నిబంధన లావశ్యకములు గాని ప్రపంచానుభవము సంపాదించి సమస్తకార్యముల చక్కఁబెట్టుకొన సమర్థులయినవారికి కూర్చుండుట కొకనియమము, నిల్చుండుట కింకొకటియు, వస్త్రధారణమున కొకటియు, దాని విసర్జనమున కింకొకటియు నుండెనేని స్వేచ్ఛగ ఆలోచించుట యెట్లు? సత్య మని తెలిసికొనినతరువాత దానిప్రకారము నడచుకొను టెట్లు? ఆలోచించి చూచితిమేని ఎట్టిసంఘమున పురుషునికిని స్త్రీకిని ఎక్కువస్వాతంత్ర్య మున్నదో, అట్టిసంఘములె యెక్కువఅభివృద్ధిని గాంచియున్నవి. మనసంఘమునం దిట్టిస్వాతంత్ర్యము లేమిచేతనే స్వశక్తియందు మనవారికి నమ్మకము లేక పూర్వులు చెప్పినదానియందే గౌరవ ముంచవలసియున్నారు. గనుక సంఘ మభివృద్ధికావలయునేని, సంఘమునందు మార్పులు కలుగవలయునేని, మార్పుల కెల్ల కర్త మానవుఁడే గాన మానవునకు స్వాతంత్ర్య మిచ్చుట యావశ్యక మని సంస్కర్తలు దృఢముగ నమ్మియున్నారు. స్వతంత్రత నిచ్చిన, మనుష్యుఁడు పాపకృత్యములనే కావించు ననియు, పరులకును తనకును అపకారము నొనర్చుకొను ననియు పూర్వాచారపరాయణులు వాదించెదరు కాని ప్రతిమానవుఁడును భగవదంశ సంభూతుఁ డనియు, ప్రతిమానవునకును సత్యము, ధర్మము, మొదలగువానియం దాదర మున్న దనియు మనము నిస్సంశయముగఁ జెప్పవచ్చును. బానిసలకన్న కూలికై పని చేయుకూలివాండ్రపని యెంతఆదాయకరమో, స్వకార్యమును గావించుకొనుటయం దొకనికి కూలి నిచ్చి వానిని నిర్బంధపరచి కార్యము నెరవేర్చుకొనుటకంటె తానే చేసికొనుట యెంత లాభకరమో తెలిసికొంటిమేని స్వతంత్రతవలన సంఘమున కుపద్రవములు కలుగు ననుటకంటె ప్రమాద మింకొకటి లే దని స్పష్టము కాఁగలదు. గనుకనే సంస్కర్తలు శాస్త్రనిబంధనల తగ్గించి ప్రతిహిందువునకును ఎక్కువస్వతంత్రము నీయ ప్రయత్నించుచున్నారు.

సమస్తధర్మములందును స్త్రీపురుషులకు సమానముగ నుండవలయునే కాని పురుషులకు స్త్రీలకంటె నెక్కువస్వాతంత్ర్యమును గాని యెక్కువహక్కులను గాని యీయవలసినది లే దనియే సంస్కర్తలవాదము. పురుషుఁడుమాత్రమె విద్యావంతుఁడై, స్త్రీకి విద్య నేర్చుకొనుట కర్హత లే దని చెప్పుటయు, ఏకకాలమునం దనేకస్త్రీల పెండ్లియాడుచు ఒకభార్య గతించినయనంతరము మఱియొకభార్యను పెండ్లియాడుచు పురుషుఁ డుండ, స్త్రీకి మాత్రము పాతివ్రత్యమును, పునర్వివాహము కూడ దని బోధించుటయు, పురుషుఁడు స్వేచ్ఛగ నెట్టిఘోషా లేక సమస్తప్రదేశములయందు తిరుగుచు స్త్రీకి మాత్రము స్వాతంత్ర్య మీయక ఖైదీలవలె నుంచుట యావశ్యక మని తలంచుటయు

ఈ మొదలగునవి ధర్మవిరుద్ధము లనియు న్యాయవిరుద్ధము లనియు సంస్కర్తలు నొక్కి వక్కాణించుచున్నారు. స్త్రీలు సహజస్వభావముచేతనే దుర్మార్గులును దుష్టచిత్తులు ననియు, వారిచిత్తానుసారముగ ప్రవర్తించుటకు పురుషు లంగీకరించి రేని, సంఘమునకు వినాశ మొదవు ననియు ప్రాచీనులును శాస్త్రకర్తలును దలంచిరి. పూర్వులు చెప్పిన దానిలో సత్యేతరము లేవియు లే వని దృఢనమ్మకము గలపూర్వాచారపరాయణులును ఇప్పు డట్లే చెప్పుచున్నారు. ఇది అంతయు న్యాయమునకును ధర్మమునకును అనుభవము నకును విరుద్ధమై యున్నది. పురుషుని కెంతబుద్ధిసూక్ష్మత యున్నదో, స్త్రీకి కూడ అంతసూక్ష్మబుద్ధి యున్నది. పురుషుం డేయేకార్యములయందు ప్రావీణ్యత సంపాదించెనో, ఆయాకార్యములయందు స్త్రీకి కూడ ప్రావీణ్యత జెంద శక్తి యున్నది. నిరుపయోగము లయినట్టి యీనిర్బంధములనుండి విముక్తి గాంచినపాశ్చాత్యదేశపు స్త్రీలు సమస్తవిషయములయందును పురుషుల నోడించునంతటి సామర్థ్యమును సంపాదింపఁగలిగి యున్నారు. పురుషునివలె స్త్రీకిని స్వాతంత్ర్య మీయకపోవుట మనసాంఘికబలములో అర్ధభాగము క్షీణించుటయె గనుక సంఘ మభివృద్ధి గాంచుటయం దొకప్రధానసాధనము స్త్రీలకు సమానధర్మము లొసంగుటయే.

సంఘాభివృద్ధికి సాధనభూతములయిననూతనాదర్శముల సంఘమునందు ప్రకటింపఁజేసి, ఈనవీనోద్దేశముల నెరవేర్చుకొనుటయందు స్త్రీపురుషుల కెక్కువస్వాతంత్ర్యమును సంపాదించి దీనిమూలమున సంఘమునందు సదాచారముల వ్యాపింపఁజేయుటయే సంఘసంస్కర్తలయుద్యమ మని మన కిప్పుడు స్పష్టమగుచున్నది.

సంస్కర్త లిదివఱకు జేసినట్టియు, యిప్పుడు చేయఁదలఁచుచున్నట్టియు కార్యముల విమర్శించి చూచితిమేని వీరియుద్యమ మిట్టిదియే యని విశదముకాఁగలదు. సంఘమును బలపరుప కోరినవారై వారు నిమ్నజాత్యుద్ధరణకును, వర్ణభేదవినాశమునకును, స్త్రీస్వాతంత్ర్యమునకును పాటుపడుచున్నారు. నిమ్నజాతులవారిని హిందూసోదరు లగు మన మాదరింపనికారణముచే వారిలో ననేకులు క్రైస్తవులై మనసంఘమును విడనాడి మనకు ప్రతిపక్షమువారివలెను వైరులవలెను ఆచరించుటకు మొదలిడిరి. అనేకులు మన సంఘమునుండి విడిపోవుటయే యొకదుర్బలహేతువు. విడిపోయినవారు మనయం దింక ద్వేషబుద్ధి చూపుట మఱియొకదుర్బలహేతువై యున్నది. వీనికంటె ప్రధానమైనదుర్బలహేతు వింకొకటి యున్నది. హిందూసంఘమునందే యుండునిమ్నజాతుల

వారు అగ్రవర్ణములవారియం దొకవిధమైనఅనాదరణమును అసూయతను చూపుట కవకాశము కలిగినది. మనము సాంఘికబలమును వృద్ధిగావించుకొనవలయునేని, ఈఅనాదరణానూయతలను పోఁగొట్టవలయును. దీనికి మార్గము నిమ్నజాతులవారును హిందువులనియు; మనసోదరు లనియు తెలిసికొనుటయే. మనపండితు లెల్లరు జీవాత్మ యొక్కటియే యనియు, కావున అందరు సమానులే అనియు పాండిత్యమును ప్రకటించుటయందు నొక్కి చెప్పెదరే కాని, నిమ్నజాతులవారిని తాకుటకు గాని, వారిని ఆదరించుటకు కాని యించుక గూడ సమ్మతించరు. వీరి నుద్ధరించినఁ గాని మనసంఘము బలము గలదికాఁజాలదు. నిమ్నజాతులవా రన్న ఒకరిద్దరు కారు. ఆరుకోట్లమంది యున్నారు. వారెల్లరు శరీరకష్టమున కోర్చి జీవనోపాయమును పొందుచుండువారు. అట్టివారిని బాగుపరచి, విద్యావంతులను, వివేకవంతులను, జేసితిమేని, హిందువు లగుమనకందరికిఁ గలపరస్పరసంబంధ మభివృద్ధియై మనసాంఘికబలము వృద్ధికాఁగలదు. ధనసాహాయ్యము దీనికి ప్రధానసాధనము. నిష్కాపట్యముతో పనిచేయుట దీనికి రెండవసాధనము.

ఇట్లే వర్ణభేదము కూడ సంఘబలహీనతకు ప్రబలహేతువై యున్నవి. దీనిని గుఱించి క్రొత్తగ విశేషించి చెప్పవలసినఅంశము లేవియు లేవు. సాంఘికపరిణామమందు (Social evolution) వర్ణభేదము లుత్పత్తియగుట యావశ్యక మైనను దానివలన ప్రాచీనకాలమునం దనేకలాభములు కలిగినవి గాని యిప్పు డవి సంఘోపద్రవకరములుగ నున్న వని నిస్సంశయముగఁ జెప్పవచ్చును. ఈయుపద్రవము లెట్టివో యొక యుదాహరణము స్పష్టముచేయఁగలదు. ప్రస్తుతకాలమున రాజకీయవిషయములయం దభివృద్ధి గాంచఁదలచినమన కీభేదము లెంతహానికరములుగ నున్నవో యెల్లరికి దెలిసిన విషయమే. రాజకీయోద్యోగములగుఱించి యిప్పుడు మనదేశమునందు విచారణ జేయుచుండుకమిటీవారియెదుట ఒకవర్ణమువారు మఱియొకవర్ణమువారి నేవప్రకారముగ దూషించుచున్నారో సర్వవిదితమే. ఏదియైన నొకకార్య మావశ్యక మని యెవ రైన జెప్పిరేని, దానిలాభనష్టములగుఱించి విచారించునపుడు, దేశమున కంత అది మేలు చేయునా, లేక కీడు చేయునా అని ఆలోచింపక, ఒక్కొకవర్ణమువారు అది తమకు మేలు చేయునా కీడు చేయునా అనియే ఆలోచించుచున్నారు. వర్ణభేదములవలన ప్రజలు స్వలాభపరులై దేశక్షేమమునందు శ్రద్ధవహింపకయున్నారు. ఇట్టినష్టము లింకను ఎన్నియో కలవు. గనుక సహపఙ్తిభోజనములవలనను, వర్ణాంతరవివాహములవలనను ఇట్టిభేదముల నశింపఁజేసి, ప్రజలు స్వసౌఖ్యమునకు గాక స్వదేశమునకై పాటుపడుట కర్తవ్యము.

సాంఘికబలమును వృద్ధిపరచుటకై సంస్కర్తలు పాటుపడుచున్నా రనుట కీపై రెండువిషయములు నిదర్శనములై యున్నవి. స్వాతంత్ర్య మున్న గాని సంఘ మభివృద్ధి కా దని సంస్కర్తలు వాదించుట కొకయుదాహరణము నిచ్చి యీవిషయచర్చ నింతటితో విరమింతము. సముద్రయానమువలన దేశమున కనేకలాభములు కలుగు నని యెల్లరు నొప్పుకొనవలసినదే. వ్యాపారమునకై సముద్రయానము జేయువారు, విద్య నభ్యసించుటకై యీకార్యము జేయువారును, వైదికమతము నితరదేశములయందు వ్యాపింపఁ జేయుటకై వెళ్ళువారును, ఏదియో యొకవిధముగ దేశమునకు మేలును జేయుచున్నారు. ఇంతటిమేలు చేయుచున్నవారిని సంఘమునుండి బహిష్కరించుటకంటె ధర్మవిరుద్ధ మే మున్నది? ఒకవేళ దేశాంతరమునం దుండునపుడు వీరు వైది[illegible]త్ర లాచరించలేదు గాన వీరిని శిక్షించుట ధర్మ మని అంటిరేని, దేశాంతరమునకు వెళ్ళక సంఘమునందే యుండి కర్మల విడనాడి దుష్కృత్యముల గావించుచున్నవారిని మనము శిక్షింపగలిగియున్నామా? వీరికి లేనిశిక్ష వారి కేల యుండవలయు? ఇది గాక యెవనికర్మ వాని దనియు, స్వకర్మవలనిఫలము తానె గాని యితరు లనుభవించ రనియు మనము దృఢముగ నమ్ముచుండ, తనలాభముకొఱకె గాక దేశక్షేమముకొఱకై పాటుపడుచుండు వీ రేమైన తప్పు గావించిరేని దానివలనిఫలము వారు తప్పక బొందుదురుకదా? వారి స్వాతంత్ర్యమును నశింపఁజేయుటకు మన మేల ప్రయత్నింపవలయు? వారిస్వాతంత్ర్యతవలన సంఘమునందలియితరుల కేమైన కష్టనష్టములు కలిగనేని వారిని బహిష్కరించుట దూషించుట బాగుగ నుండునే గాని యెల్లరికి లాభము కలుగజేయుచుండువారిని ట్లనాదరించుట ధర్మమా? గనుక స్వాతంత్ర్య మిచ్చుటవలన దేశమునకు లాభమే కాని నష్ట మెన్నటికిని గలుగదు.

సంఘసంస్కరణోద్దేశములలో నెద్దానినిగుఱించి యాలోచించినను, దేశమునకు లాభకరము లైన వని స్పష్టముకాకమానదు. ఈయుద్యమము మనదేశమందు వేగముగ నభివృద్ధి గాకయుండుటకు కారణముల నిదివఱకె చెప్పియుంటిమి. ఒకవిషయము మాత్రము మనము ముఖ్యముగ గమనించవలయును. దేశమునందు నీతిశాస్త్రజ్ఞులును పండితులును సద్గ్రంథములును బయలువడినంతమాత్రముననే దేశ మెన్నటికి బాగుపడఁ జాలదు. నీతిశాస్త్రములు లేమిచే మాత్ర మే దేశము క్షీణించలేదు? నీతి యెది

యనియు, ధర్మ మిది యనియు, తెలిసినప్పటికిని, వీనిప్రకారముగ నడుచుకొనక వీనికి విరుద్ధముగ ప్రవర్తించుటచేతనే సంఘములు నశించినవి. గనుక ధర్మప్రవర్తన యన నిది; దానివలన కలుగులాభము లిట్టివి అని తెలిసికొనుటకన్న, ధర్మప్రవర్తనయం దుత్సాహమును సంపాదించుట ప్రతివానికిని ప్రధానమై యున్నది. గ్రంథములయం దనేక ధర్మములగురించి యెల్లరు చదువువారలే. వానిప్రకార మాచరించువారు మట్టు కెంద ఉన్నవారు? గనుక ఉత్సాహము, ధైర్యము, సాహసము, మనసంఘమునం దిప్పు డావశ్యకములై యున్నవి.

సంస్కరణసభల గావించి, అనేక విషయములగురించి తీర్మానముల జేయువారలలో కొందరై [illegible] కార్యోత్సాహము గలవారై తమమాటలప్రకార మాచరించుచుండనలయు. ఇతరులు తమతో కలసినను కలియకపోయినను తాము ధర్మాచరణము గావించుచున్నయెడల ఇప్పుడు గాకపోయినను కొంతకాలమునకైన సంస్కరణ మభివృద్ధి జెందగలదు. కార్యోత్సాహము గలిగి దేశాభివృద్ధికై సంస్కర్తలు సంఘీభావముతో పనిచేయుదురు గాక అని నమ్ముచు నింతటితో విరమించుచున్నాను.

# ఆ ం ధ్ర ర ఘు వ ం శ ము.

ఇది శ్రీఆదిపూడిసోమనాథఋషిచే కాళిదాసునిరఘువంశమహాకావ్యమునకు ప్రతిపదార్థ మైన తెనుఁగు. ఇందలికథ దిలీపమహారాజుసంతానముకొఱకువాశిష్ఠాశ్రమమున కేగి గోవును పూజించి తత్ప్రసాదమున రఘువును గాంచుటయును, అరఘుపుత్త్రుఁ డగు నజమహారాజు ఇందుమతినిఁ బెండ్లియాడుటయు, ఆమెయకాలమృత్యువును, అజునిదుఃఖము, దశరథునివేట, వసంతవర్ణనము, శ్రీరామునియవతారకారణము, సీతాపరిణయము, భార్గవునినిర్జయము, రావణవధ, సీతాసతీపరిత్యాగము, కుముద్వతీపరిణయము, అదితివర్ణనము, వంశానుక్రమణిక, అగ్నివర్ణునిశృంగారము మున్నగుపందొమ్మిదిసర్గలు. ఈవిచిత్రము లత్యంతమనోహరవర్ణనాభూయిష్ఠమై సొంపారుచున్నవి.

## భాషాంతరీకరణము.

ఇది మిక్కిలిరసవత్తరమై మహానందమును గలుగఁజేయుచున్నది. ఆంధ్రభాషావాఙ్మయమునం దధికభాగము సంస్కృతమునుండి పరివర్తనము చేయఁబడి ప్రోది వహించినది. అందు కొన్ని భాషాంతరీకరణములు మూలమునకంటె నధికానందమును గాని నూతనానందమును గాని గలిగించునవిగా నించుమించు మార్పుల ననుసరించియున్నవి. కాని సంస్కృతరఘువంశకావ్యమును జదివినప్పు డేయానందము పండితుల కుజ్జీవింపఁబడి గంగాతరంగములయందు నోలలాడు చంద్రకిరణముల ననుకరించుచుండునో, ఆమహానందవారాశియే యీయాంధ్రరఘువంశమును జదివినప్రతివారికినిఁ బొడగట్టుచుండును.

ఈరఘువంశమహాకావ్య మిదమిద్ధ మని కొనియాడుటకు నేనే కాదు మహాపండితులు సైతము చాల రనుట సామాన్యోక్తి. ఇందలిప్రతిసర్గ యన నేల, ప్రతిపద్యమును పువ్వులచే విరిసినలతాగృహమువలెను,

మణులతోఁ దాపినబంగరుకమ్మవలెను, మనోహరమును గలిగించుచున్నది. ఇట్టియమూల్యగ్రంథరత్నమును కేవలసంస్కృతభాషావిదులకే విడిచి మన మూరక చప్పనికసుగాయలు నమలుచుండుట యెంతయు శోచనీయము. దీనిని పూర్వ మప్పుదూరి కిచ్చెయ్య యనునొకకవి పదియాశ్వాసములుగాఁ దెనిఁగించియున్నాఁ డని కవులచరిత్రమునందుఁ జూడఁబడుచున్నది గాని, ఆగ్రంథముమాత్రము ముద్రణాలో నున్నట్లు గానరాదు. అందలిపద్యము లొకటి రెం డుదహరించిరి. అవి-

శ్లో॥ మందః కవియశఃప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతాం
ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహు రివ వామనః

సర్గ ౧. శ్లో. ౩. రఘు.

ఉ॥ ఉన్నతమర్త్యలభ్యపద మొందెద నన్మతి నూర్ధ్వబాహుఁడై
యున్న సగర్వఖర్వమనుజోత్తముకై వడి మందబుద్ధినై
కొన్నసరుండు సాధుకవికుంజరకీర్తి వహింప నెంచినన్
సన్నుతిసేయఁబోవుదురొ సత్కవులైనసమస్తభూజనుల్

శ్లో॥ అనేనపర్యాసయతాశ్రుబిందూన్ । ముక్తాఫలస్థూలతమాన్ స్తనేషు
ప్రత్యర్పితాః శత్రువిలాసినీనాం । ఉన్ముచ్యసూత్రేణవినైవ హారాః

సర్గ ౬. శ్లో ౨౮. రఘు.

చ॥ పొలతిరొ విన్ము మత్తియపుఁబూసలఁ బోలెడు బాష్పవారిబిం
దులఁ బరిపంథిధాత్రిపవధూస్తనపాళినిఁ బ్రస్తరించునీ
కలితమహారాజుఁడై నజనకాంతునిచేత సమర్పితంబులై
యలరె గృహీతసూత్రకములై తగుమౌక్తికతారహారముల్.

ఇది మూలమునకంటె విశేషముగా పెంచి కాళిదాసునకు విద్య గలిపినట్లు బహుయమకపదఘటితమై యర్థ మొకమూల నొత్తిగిల్లినను, నారికేళపాకమున దిగినది. ఇది యసామాన్యము గాక పండితులకు, విశేషించి సంస్కృతరఘువంశము చదివినవారికె యక్కఱకువచ్చుచున్నది.

ఇట్లని నే నాయాదికవిని నిందించుట గాదు. ఆకాలపువిద్యాధికుల యాదరణము ననుసరించి వ్రాసియుండవచ్చును. కాని కాళిదాసుని యుద్దేశప్రకారము పండితులకును స్త్రీలకును బాలకులకును సంతోష మొసంగునట్లు మృదుమధురరసగంభీరభావములతో తేలికగా శ్రీరామ చంద్రునివంశచరిత్రము శ్రీవాల్మీకిరామాయణ ముండగా, నేల వ్రాసె నో యొక్కింత యూహించియున్నచో, నీసోమనాథకవి మరల తెనిగిం చుట కవసరము పట్టకపోయియుండును. నిజముగా నీకవి యాంధ్రదే శమునకు మేలు చేసె ననుటకు సందియము లేదు. వీరి కాంధ్రులం దఱు కృతజ్ఞులై యుండవలసినది. ఏ మనిన, నీమహాప్రౌఢకావ్యము నం దెన్నియో నేర్చుకొనఁదగినవిషయము లున్నవి. అట్టిదానిని సులభ శైలిగా రసవత్తరము లగునట్లు మనోహరగీతములు వృత్తములయం దిమిడించి యన్నితరగతులు గల మనుష్యలోకమునకు కానుక నొసంగెను.

## భాషావిషయము.

ఇది ప్రబంధ మని చదివినవారికి వర్ణనాబంధ మైనప్రబంధము వలెను, నూతనకల్పిత మైననవలవలె జదివినవారికి నద్భుతస్వభావవర్ణనా విలసన మైననవలవలెను, పురాణమువలెఁ జదివినవారి కిది యొకపెద్ద పురాణమువలెను గోచరించును. ప్రబంధరచన కిది యొకనూతనమార్గము. ఇది మూలమునకు సరి యైన తెనుఁగు గావున దీనియందు సాహిత్యపరీక్షణమును పరీక్షించుటకు వీలుపడదు. ఇది మూలమున కెంత సరియైన తెనుఁగో యీక్రిందిపద్యములఁబట్టి తెలియుచున్నది.

**తే. గీ.** మందుఁడను నేను కవియశ మందఁ గోరి
పరమపరిహాసమున కిలఁ బాత్రుఁ డగుదు
పొడుగువానికి నందంగఁ బోలుఫలము
బడయఁ గే లెత్తునప్పొట్టివానికరణి.

తే. గీ. అశ్రుబిందులు ముత్యంబు లంతలేసి
వైరికాంతలచనులపైఁ బ్రస్తరించి
ఇతఁడు ముగ్గొన్నసరులకుఁ బ్రతిగ నిడిన
దారములు లేనిదండలతీరు గొలిపె.

ఇందలిశైలి దెలియుటకు మఱియొకపద్యమును వ్రాసి విడుచుచున్నాను.

తే. గీ. ఈయలరుదండ ప్రాణముఁ దీయునేని
నేల చంపదు వక్షమం దిడిననన్ను
నొక్కచో విష మమృత మౌ నొక్కచోట
నెన్న నమృతంబు విష మగు నీశ్వరేచ్ఛ    అ. ౮. ప ౪౬.

మఱియు

తే. గీ. ఇందుమతివలె మరణంబు నందినట్టి
విమలగుణమణిఖని యయి వెలిగినట్టి
సుత శకుంతల కిడితి నంకితముగాఁగఁ
దనరు గా కిది యాచంద్రతారకముగ.

అని యుండుటచేతను, ఈగ్రంథపేఠికయం దీకవిపుత్రిక యుండువ శకుంతలాదేవి బొంబాయిపురమున భర్తృగృహమున నగ్నివాతఁ బడుట యును మున్నగుదుఃఖచరితము మిక్కిలి జాలిని గలిగించుచున్నది.

ఈగ్రంథము చక్కఁగా ముద్రింపఁబడి క్యాలికోబైండు చేయఁబడి యున్నది. ఒకవైపు సంస్కృతమును నొకవైపు తెనుఁగుపద్యములును గ్రాలుచున్నవి. దీనికి శ్రీ కె. వి. లక్ష్మణరావుగా రుపోద్ఘాతమును వ్రాసియున్నారు. ఇందు శకుంతలాదేవిపటము గూడ చేర్పఁబడియున్నది. దీనివెల ఒకరూపాయి మాత్రమే. సామాన్యనాటకపుస్తకములకే యింతకన్న నెక్కువవెల యున్నది. దీని నాంధ్రజను లందఱు కొని కవి కీపుస్తకము లింకను వ్రాయునట్లు ప్రోత్సాహ మొసంగెదరు గాక!

# కిరసనాయిలునూనె.

ఈకాలమునందుఁ బ్రపంచకమునం దెచట జూచినను కిరసనాయిలునూనెయొక్క వ్యాప్త మతివిస్తారమయ్యెను. నూరుసంవత్సరములకుఁబూర్వము జను లీనూనెయొక్క యుపయోగమునుగూర్చి తెలిసికొనియుండలేదు. పదితొమ్మిదవశతాబ్దప్రారంభమునందు అమెరికాదేశమున ఉప్పుపనులకొఱకై పాతాళగంగలను బైకిఁ దీయునపుడు తలపనితలంపుగ నివియే కిరసనాయిలునూతులుగఁ బరిణమించి ఆపనులు నడపెడివారికి మిక్కిలి హృదయతాపమును గలిగించుచుండెను. ఈనూనెయొక్కయుపయోగమును గాని విలువను గాని యాకాలపువారు గ్రహింపఁజాలకపోయిరి. అందుచే ఈనూనె వారి యుప్పునీటియందుఁ గలసి మిక్కిలినష్టమును గలిగించుచుండెను. 1829 వ సంవత్సరమునం దొకచోట పాతాళగంగను దీయగా అందులోనుండి యపరిమితముగ కిరసనాయిలునూనె పైకుబికి యనేకమైళ్ళు పొడుగు గల నదిగాఁ బ్రవహింపసాగెను. అంతియ గాక ఆకిరసనాయిలునదికి ఏఁబదిమైళ్ళదూరము అగ్ని యంటుకొని యనేకదినములవఱకును మండుచునే యుండెను. దీనిని జూచుటతోడనే జనులు మిక్కిలి భయభ్రాంతులైరి. తుదకామంట యార్పివేయఁబడినను, నూనెమాత్ర మనేకసంవత్సరములవఱకును బ్రవహించుచునే యుండెను.

కొంతకాలము జరగినపిమ్మట ఔషధోపయోగమునకై ఈనూనెను చిన్నచిన్న సీసాలయందుఁ బోసి విక్రయింప మొదలిడిరి. ఇంతకంటె నితరయుపయోగమేమాత్రమైన ఈనూనెవలనఁ గలుగు నని యాకాలపువారి కెంతమాత్రమును దోపదయ్యెను. ఈనూనెయొక్కవాసన దుర్భరమై యుండుటంజేసి దీనిని గృహములయందు వెలిగింప నసాధ్యమై యుండెను.

పదితొమ్మిదవశతాబ్దమధ్యమున జను లీనూనెనుగూర్చి పరిశీలింపవలసిన యావశ్యకత గలిగెను. అప్పటికి తిమింగిలములయం దుండుక్రొవ్వువలన దీపములను వెలిగించుకొనుచుండిరి. కాని కాలము జరగినకొలదిని తిమింగిలములవేటకై ఉత్తర సముద్రములకు బోయినమనుజుల కవి దొరకుట యరుదయ్యెను. అంతట, తిమింగిలములు బొత్తిగా దొరకకపోయినయెడల తమగతి రాత్రులయం దేమి కావలసిన దని జనులు భయపడఁజొచ్చిరి. అప్పుడు శాస్త్రివేత్తలు బయలుదేఱి పరిశీలనలను జేయ నారంభించిరి. వారికి గనులనుండి తీసిన మడ్డినూనెనుండి మంచికిరసనాయిలునూనె లభించెను.

ఈపరిశ్రమయందు లభించినలాభమునకు మితము లే దని చెప్పిన నతిశయోక్తి గాదు. అయినను దీనిని ప్రారంభించిన మొదటిసంఘమునకు మాత్రము నష్టమే సంభవించినది. అయినను వారు పట్టుదలను ఓపికను గలిగినవారై 1859 వ సంవత్సరము [illegible]ంబరునెలయం దొకపాతాళనూతిని 70 అడుగులలోతునకుఁ దీయగా, భూమి

మట్టమునకు 10 అడుగులక్రిందవఱకును నూనె వచ్చినది. అనూనెను యంత్రములఁతో పైకిఁ దోడి యమ్మఁగా దినమునకు 2500 రూపాయల యాదాయము వచ్చెను.

ఈవిషయము మిక్కిలియద్భుతముగఁ గన్పట్టి దేశమంతయు నడవియందు పెట్టబడినమంటవలెనే వ్యాపించెను. సంయుక్తరాష్ట్రములయందును ఇతరదేశములయందును గూడ జనులు మిక్కిలి యుద్రేకమును బొందిరి. కొలఁదివారములలోనే వందలకొలఁది నూతులు త్రవ్వఁబడెను. ఈప్రకారము త్రవ్వఁబడినవానిలో పెక్కునూతు లెండిపోయెను. అందుచే వానిని దీసినవారు దివాలా లెత్తసాగిరి. నూతులను తగినంత లోతువఱకుఁ దీయకపోవుటయే ఎండిపోవుటకుఁ గలకారణ మని పిమ్మట గనిపెట్టఁబడినది. ఏల యన, ఇట్లెండిపోయిననూతులనే కొంతకాల మైనపిమ్మట మిక్కిలిలోతుగా త్రవ్వఁగా అమితమగునూనె లభించినది.

1861 వ సంవత్సరమువఱకును నూతులు ఎక్కువలోతుగా త్రవ్వఁబడక, యంత్రసహాయముచే నూనె తోడఁబడుచుండెను. కాని ఆసంవత్సరమునం దొకనూతిని 400 అడుగులు లోతునకుఁ ద్రవ్వగా నూనె దానంతట నదియే పైకుబికి ప్రవహింప నారంభించెను. అప్పటినుండియు నూతులను మిక్కిలి లోతుగాఁ ద్రవ్వ నారంభింపగా నదీప్రవాహమువలె నూనె బైటకు రా దొడంగెను. ఒక్కొక్కనూతియందు దినమునకు లక్షగాలనులకంటె ఎక్కువనూనె లభించుచుండెను. కాని ఈనూనెలో చాలభాగము వృథాగాఁ బోవుచుండెను. అమ్మకమునకుఁ గావలసిననూనెకంటె నమితముగా నూనె దొరకుచుండెను; అందుచేత వెల చాల మందగించెను. అంతట నూనెనూతులఖామందు లందఱును గలసినవారై ఒకసంవత్సర మగుసరికి తిరిగి నూనెయొక్కధర పెరుగునటులఁ జేసిరి. రాతినూనెయే యాధారముగా గల మోటారుబండ్లు విశేషించినకొలఁదిని ఈనూనె యొక్కవిలువ యధికముగా దొడంగెను.

సంవత్సరమునకు 3,000,000,000 రూపాయిలు విలువ గలనూనె ప్రపంచకమునం దుత్పత్తియగుచున్నది. ఇందులో సగభాగ మొక్కయమెరికాయందే దొరకుచున్నది. ఈనూనె నంత నొక్కచోటఁ జేర్చిన నం దొక పెద్దయుద్ధనావలగుంపు తేలియాడవచ్చును. నూరుసంవత్సరములక్రిందట ఈనూనెయొక్కయుపయోగ మెవ్వరికిని దెలియకుండుటయే గాక ఆకాలపుజనులు దీనిని నసహ్యమును బుట్టించుపదార్థముగఁ బరిగణించిరి. భూమి యొక్కయంతర్భాగమునం దీనూనె ఎట్లు లభించుచున్నదియో చెప్పుట కష్టతరము. జంతుసంబంధమైనట్టియు, ఉద్భిజ్జసంబంధమైనట్టియు పదార్థములలోనిమూలపదార్థములు వేఱుపడుటవలన ఈనూనె గలుగుచున్న దని కొందఱు చెప్పుచున్నారు. లోహపదార్థములనుండి కలుగుచున్న దని మఱికొందఱు శాస్త్రజ్ఞులు తలంచుచున్నారు. ఇందేది [illegible] తెలిసికొనుట దుస్సరము.

# ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము

## నిడదవోలు , కృష్ణాజిల్లా.

ఇందు చరిత్రబోధకములు, మనోహరకల్పితములు నగునవలలు కాలికో బైండు చేయింపఁబడి రెండుమాసముల కొక్కొక్కటిగ వెలువడుచుండును. ఆంధ్రభాషాభివృద్ధి కీనవలలు ప్రథమసోపానము లని చెప్పవచ్చును. ఇందు శాశ్వతచందాదారులుగా చేరువారికీగ్రంథములు డెమ్మిసైజున 100 పేజీలకు పోస్టేజిసహా రు 0 6 0 చొ॥ పంపఁబడుచుండును. సామాన్యముగా నవల 1కి రు 1 0 0 వెలకు మించి యుండదు. ఇతరులకీగ్రంథములు పోస్టేజి గాక 100 పేజీలకు రు 0 8 0 చొ॥ నీయబడును. శాశ్వత చందాదారులు అడ్మిషన్ ఫీజుక్రింద రు 0 2 0 లు మాత్రము చెల్లింపవలయును.

**N. B:—** ఈగ్రంథమాలిక కైదుగురుచందాదారులను చేర్చినవారి కిందు వెలువడిన గ్రంథములలో వారు కోరిననవల బహుమానముగా నీయబడును.

### ఇందు వెలువడిననవలలు.

| | చందాదార్లకు | ఇతరులకు |
|---|---|---|
| దుర్గేశనందిని | 0 12 0 | 1 0 0 |
| వసుమతీవసంతము | 1 0 0 | 1 8 0 |
| లలితచంద్రహాసము | 0 10 0 | 0 14 0 |
| మృణ్మయి | 1 0 0 | 1 8 0 |
| సీతారామ | 1 0 0 | 1 8 0 |
| నూర్జహాను | 1 0 0 | 1 8 0 |
| రాధారాణి | 0 4 0 | 0 4 0 |
| యుగళాంగుళీయకము | 0 3 0 | 0 3 0 |

వలయువారు

సెక్రిటరీ, ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము

నిడదవోలు, కృష్ణాజిల్లా

అని వ్రాయవలయును.

# ఆంధ్రభాషాభివర్ధనీసంఘము

—మచిలీపట్టణము—

ఈసంఘముచే బ్రకటింపఁబడు గ్రంథములన్నియుఁ గొనుటకు నొప్పుకొనువారు శాశ్వతచందాదారులుగా నెంచబడుదురు. వారికి మాచే బ్రకటింపఁబడు గ్రంథములన్నియు నూరుపుటలకు 0—4—0 చొ॥ నీయఁబడును. ప్రవేశరుసుము నాలుగు అణాలు మాత్రము చెల్లించవలెను. ఇతరులకు నూరుపేజీలకు 0—6—0 చొప్పున నీయఁబడును.

—ఈసంఘమువారిచే బ్రకటితమైన గ్రంథములు—

| | | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|---|
| 1. | భారతధర్మదర్పణము | రు 0 1 6 | 0 2 0 |
| 2. | అక్బరుచరిత్ర 128 పుటలు | 0 4 0 | 0 6 0 |
| 3. | పీష్వానారాయణరావు | 0 1 6 | 0 2 0 |
| 4. | వివేకానందస్వామిజీవితము 157 పుటలు | 0 6 0 | 0 9 0 |
| 5. | సిక్కులచరిత్ర 256 పుటలు | 0 10 0 | 0 15 0 |
| 6. | విద్యాసాగరునిచరిత్ర 150 పుటలు | 0 6 0 | 0 9 0 |
| 7. | రామమోహనరాయలచరిత్ర 200 పుటలు | 0 8 0 | 0 12 0 |
| 8. | స్వాతంత్ర్యదర్శనము కాశీకోహైండు | 0 7 0 | 0 12 0 |
| 9. | మహారాష్ట్రచరిత్ర 500 పుటలు | 1 4 0 | 1 14 0 |
| 10. | ఆంగ్లేయరాజ్యాంగనిర్మాణచరిత్ర 200 పుటలు | 0 12 0 | 1 4 0 |
| 11. | ఆరోగ్యశాస్త్రము 265 పుటలు | 0 10 0 | 1 4 0 |
| 12. | అశోకచరిత్ర 330 పుటలు | 0 13 0 | 1 4 0 |

పునర్ముద్రితములోనున్న గ్రంథములు.

నెం. 2, 4, 5, 6 ర్లు గ్రంథములు.

ముద్రణములోనున్న గ్రంథములు.

1. ధనశాస్త్రము. 2. ప్రభావతి (నవల). 3. జ్యోతిశ్శాస్త్రము 4. సీతాచరిత్ర.

తెలయువారు—మేనేజరు,

ఆంధ్రభాషాభివర్ధనీసంఘము,

మచిలీపట్టణము.

కీర్తి శేషులైన శ్రీ కందుల శ్రీమన్నారాయణగారిచే స్థాపింపఁబడియె.


సంపుటము. III || అగస్టు. 1913. || సంచిక. 4


# మానవసేవ.

మత సంఘ పరిశ్రమ భాషావిషయములఁ జర్చించు

సచిత్రమాసపత్రిక



పత్రికాసంపాదకులు

నాళము కృష్ణారావు

సత్యవోలు అప్పారావు.


సత్యవోలు అప్పారావుచే
శ్రీవిద్యానిలయ ముద్రాశాలయందు
ముద్రింపించి ప్రకటింపఁబడియె.
రాజమహేంద్రవరము.

1913.

# విషయములు


| | | |
|---|---|---|
| 1 | భక్తసంజీవని | నాళము కృష్ణారావుగారు |
| 2 | నీతిబోధ | సత్యవోలు అప్పారావుగారు |
| 3 | చాణక్యశతకము | కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు |
| 4 | సౌఖ్యజీవనము | ముట్నూరి వేంకటసుబ్బారాయుడుగారు |
| 5 | ప్రకృతివిలసనము | ఉమ్రే ఆలీషాకవిగారు |
| 6 | మధుకరము | పిప్పరసోదరకవులు |
| 7 | దుర్గావతి | గోటేటి జగన్నాథరావుగారు |
| 8 | ధర్మపుత్రుడు | కామరాజు హనుమంతరావుగారు |
| 9 | బ్రాహ్మమతోద్దేశము | వెలిదండ శ్రీనివాసరావుగారు |
| 10 | బ్రాహ్మసమాజచరిత్ర | పులవర్తి వేంకటసుబ్బారావుగారు |
| 11 | ప్రేమ | అయ్యంకి వేంకటరమణయ్యగారు |
| 12 | బ్రహ్మజ్ఞానపరీక్షాబహుమానములు | ,, ,, |


## చిత్రపటములు


గౌతమబుద్ధుడు, దేవదత్తుడు

# రాజపోషకులు

1. శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు.
2. శ్రీరాజా నాయని వేంకటరంగారావుబహద్దరువారు. మునగాల.

# పోషకులు

---

1. శ్రీయుత శ్రీకొవ్వూరి చంద్రారెడ్డిగారు. జమీందారు, నిడదవోలు.
1. ,, శ్రీకలిదిండి వేంకటరామరాజుగారు ,, ,,
3. ,, తమ్మన మాణిక్యముగారు ఏలూరు.
4. ,, శ్రీమోతే గంగరాజుగారు. జమీందారు. ఏలూరు.
5. శ్రీరాజా కాళేపల్లి అచ్యుతరామయ్య బహద్దరువారు. యాదవోలు.
6. శ్రీరాజా కోటగిరి వేంకటకృష్ణరావు బహద్దరువారు. గంపలగూడెం

# అభిమానులు

1. శ్రీయుత అద్దేపల్లి లక్ష్మణస్వామిగారు. ఏలూరు.
2. ,, శ్రీఉయ్యూరు మైనరు జమీందారుగారు. చెన్నపురి.
3. ,, చుండూరు శ్రీరాములుగారు. ఏలూరు.
4. శ్రీరాజా వెలుగోటి ముద్దుకృష్ణయాచేంద్ర బహద్దరువారు. వేంకటగిరి.
5. శ్రీయుత డి. పానకాలరావుగారు. కోయంబత్తూరు.
6. ,, తోట రామచంద్రయ్యగారు. పూళ్ళ.
7. ,, వనమాలి జగన్నాథముగారు. రంగూను.
81. శ్రీరాజా బులుసు సర్వారాయుడు బహద్దరుగారు. కవిటేశ్వరపురము

# చందా వివరము

| | | |
|---|---|---|
| చందాదారులకు | వత్సరమునకు | రు 3 |
| అభిమానులకు | ,, | రు 5 |
| పోషకులకు | ,, | రు 10 |

రాజపోషకులయాదరణము వారియనుగ్రహాధీనము.

మాదిరిపత్రిక వలయువారు 4 అణాలపోష్టుబిళ్ళలఁ బంపవలయును.

# ప్రకటనపద్ధతి

| | పుటకు. | | | అరపుటకు |
|---|---|---|---|---|
| వత్సరమునకు | రు 30 | ... | ... | రు 18 |
| అర్ధవత్సరమునకు | 18 | ... | ... | 10 |
| మూడుమాసములకు | 10 | ... | ... | 6 |
| మాసమునకు | 3-8 | ... | ... | 2-8 |



గౌతమబుద్ధుఁడు, దేవదత్తుఁడు.

సీ. శాంతున కపవర్గసౌఖ్యసంవేదికి నిర్వాణభర్తకు నిర్విశేషు
నకు ఘోరునకు గూఢునకు గుణధర్మికి సౌమ్యున కధికవిజ్ఞానమయున
కఖిలేంద్రియద్రష్ట కధ్యక్షునకు బహుక్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి
మూలప్రకృతి కాత్మమూలున కఖిలేంద్రియజ్ఞాపకునకు దుఃఖాంతకృతికి
ఆ. నెఱి నసత్య మనునీడతో వెలుఁగుచు
నుండునెక్కటికి మహోత్తరునకు
నిఖిలకారణునకు నిష్కారణునకు న
మస్కరింతు నన్ను మనుపుకొఱకు. 188

సీ. సర్వాగమామ్నాయజలధికి నపవర్గమయునికి నుత్తమమందిరునకు
సకలగుణారణిచ్ఛన్నబోధాగ్నికిఁ దనయంత రాజిల్లుధన్యమతికి
గుణలవోద్దీపితగురుమానసునకు సంపత్తికర్మనిర్వర్తితునకు
దిశ లేనినాబోఁటిదీనులపాపంబు లడఁచువానికి సమస్తాంతరాత్ముఁ
ఆ. డై వెలుంగువాని కచ్ఛిన్నునకు భగ
వంతునకుఁ దనూజపశునివేశ
దారసక్తు లైనవారి కందఁగరాని
వాని కాచరింతు వందనములు. 189

సీ. పరధర్మకామార్థవర్జితకాము లై విబుధు లెవ్వాని సేవించి యిష్ట
గతిఁ బొందుదురు చేరి కాంక్షించువారి కన్యయదేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ
ముక్తాత్ము లెవ్వాని మునుకొని చింతింతు రానందవార్ధిమగ్నాంతరంగు
లేకాంతు లెవ్వని నేమియుఁ గోరక భద్రచరిత్రంబుఁ బాడుచుందు
ఆ. రామహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మ
యోగగమ్యుఁ బూర్ణు నున్నతాత్ము
బ్రహ్మ మయినవానిఁ బరుని నతీంద్రియు
నీశు దూరు సూక్ష్ము నే భజింతు. 190

క. విశ్వాకరు విశ్వదూరుని
విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వ నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు
నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్. 191

సీ. పావకుం దర్చుల భానుండు దీప్తుల నెబ్భంగి నెగడింతు రె ట్లడంతు
రా క్రియ నాత్మకరావళిచేతను సకలజనంబుల సర్వజంతు
గణముల జగముల ఘననామరూపభేదములతో మెఱయించి తగ నడంచు
నెవ్వఁడు మనము బుద్ధీంద్రియంబులు దాన యై గుణసంప్రవాహంబు నెఱపు
తే. స్త్రీనపుంసకపురుషమూర్తియును గాక
తిర్యగమరనరాదిమూర్తియును గాక
కర్మగుణభేదసదసత్ప్రకాశి గాక
వెనుక నన్నియుఁ దా నగువిభుఁ దలంతు. 192

క. జననస్థితివిలయంబుల
కనయంబును హేతుభూత మగుమాయాలీ
లను జెంది నటన సలిపెడు
ననఘాత్మకునకు నొనర్తు నభివందనముల్. 193

క. జననస్థితిలయదూరుని
మునినుతు నిర్వాణసుఖసముద్రుని సుగుణుం
దనుతనుని బృథులపృథులుని
ననఘాత్ము మహానుభావు నభినందింతున్. 194

క. శశ్వత్ప్రశాంతు నభయుని
విశ్వాత్ముఁ బ్రబోధమాత్రు విభు సంశుద్ధున్
శాశ్వతు సదసత్పూరుషు
నీశ్వరుఁ జిత్తమునఁ దలఁతు నెంతయు భక్తిన్. 195

క. జీవావలిఁ గల్పించుచు
జీవావలిలోనఁ దగ వసించుచుఁ బ్రియవ
స్త్వావలిలోపలఁ బ్రియవ
స్త్వావలి యై యుండునీశు ననిశముఁ గొలుతున్. 196

తే. పరమునికి వందన మొనర్తుఁ బరిఢవించి
ము న్నవితథానుభూతికి మ్రొక్కికొందు
మెఱయ గుణములఁ దేలునిమిత్తమాత్ర
బంధు నైనట్టివానికిఁ బ్రణతు లిడుదు. 197

ఆ. తవిలి గుణములచేతఁ దత్త్వబుద్ధులచేత
నిగిడి కానరాని నెలవువాని
మొదలఁ దాన కలిగి ముక్తిమానావధి
రూపమైనవానిప్రాపుఁ గందు. 198

ఆ. ఎల్లతనువులందు నిరవొంది తనతోడఁ
బొందు చేసినట్టిపొందు కాని
పొందు పొందలేఁడు పురుషుండు గుణము నా
గుణుని బోలునట్టిగుణుఁ భజింతు 199

క. అనుపమగుణసంపూర్ణుని
ననఘుని సుస్థితుని గతుని నానందు ననం
తుని భక్తహృద్గుహాసీ
నుని సర్వేశ్వరుని ఘనుని నుతు లొనరింతున్ 200

తే. తవిలి యాదేవదేవునిభవమహాబ్ధి
తారణంబును మంగళకారణంబు
నఖిలసంపత్కరంబునై యలరుపాద
వనజమున కే నొనర్చెద వందనములు. 201

తే. అవ్యయుండును సర్వభూతాత్మకుఁడును
సర్వశక్తిధరుండును శాశ్వతుఁడును
విశ్వకరుఁడును గురుఁడును విమలమూర్తి
యయినవనీశు నుతించెద నమలభక్తి. 202

సీ. ఎవ్వనిగుణముల నెట్టికోవిదులైన వినుతింపఁగా లేక వెగడుపడుదు
రెవ్వనిఘనతత్త్వ మెనయంగ సనకాదియోగిమానసపంక్తి నోలలాడు
నెవ్వనిరూపంబు నేర్పాటు గానక వేదంబు లందంద వాద మడుచు
నెవ్వనికారుణ్య మీలోకముల నెల్లఁ దనిపి యెంతయు ధన్యతములఁ జేయు

తే. నట్టిసర్వేశుఁ బాపసంహారు ధీరు
శాశ్వతైశ్వర్యు నాత్మసంసారు నీశుఁ
బ్రవిమలాకారు సంసారభయవిదూరు
భక్తజనపోషుఁ బరితోషుఁ బ్రస్తుతింతు. 203

సీ. భావింప నెవనికి బ్రహ్మాండ మంతయు నాటలబొమ్మరి ల్లనఁగ నుండు
పోలంగ నెవనికి భువనంబు లన్నియుఁ దనయింటిలో దొంతు లనఁగ నుండు
కేళిమై నెవని కఖిలభూతచయములు దనయింటిలో బొమ్మ లనఁగ నుండు
లీలమై నెవనికి నీలోక మంతయు నచ్చటిబొమ్మపీ టనఁగ నుండు

ఆ. హేళిమై నెవనికి నినచంద్రబింబంబు
లచటిదీపకళిక లనఁగ నుండు
నట్టినిత్యఖేల నానందలోలు లీ
లావిశాలు గొలుతు భావమందు **204**

సీ. ఎవ్వనికారుణ్య మెల్లభూతములకు సుఖమును వృద్ధియు సొరిదిఁ జేయు
నెవ్వనిశుభనామ మేప్రొద్దు నుడువంగ సంసారబంధంబు సమసిపోవు
నెవ్వనిచరితంబు హృదయంబుఁ జేర్పంగ భయ మొంది మృత్యువు పరువువెట్టు
నెవ్వనిపాదంబు లెప్పుడు భక్తితో సేవింప నైర్మల్యసిద్ధి గలుగుఁ

తే. దపసు లెవ్వనిధ్యానంబుఁ దగిలి యుండి
శాంతితెరువుఁ గాంచి సుఖింతు రెప్పుడు
నట్టిశాంతినికేతను నమృతమయుని
సచ్చిదానందు నాత్మలో సంస్తుతింతు. **205**

సీ. ఎవ్వనిమాయకు నింతయు మోహించుఁ జతిమి యెవ్వనిమాయ దాట రాదు
తనమాయ నెవ్వఁ డింతయు గెల్చినట్టివాఁ డెవ్వనిఁ బొడగాన రెట్టిమునులు
సర్వభూతములకు సమవృత్తి నెవ్వఁడు చరియించుఁ దనచేత జనిత మయిన
ధరణి పాదములు, చిత్తము సోముఁ, డగ్ని ముఖంబు, గన్నులు సోమకమలహితులు

తే. చెవులు దిక్కులు, కేశంబు సిద్ధజలము,
మూఁడుమూర్తులపుట్టిల్లు మొదలినెలవు,
గర్భ మఖిలంబు, మూర్ధంబు గగన మగుచు
నుండు నెవ్వఁడు వాని నమస్కరింతు **206**

క. పురుషుం డాద్యుఁడు ప్రకృతికిఁ
బరుఁ డవ్యయుఁ డఖిలభూతబహిరంతర్భా
సురుఁడును లోకనియంతయుఁ
బరమేశ్వరుఁ డైనహరికిఁ బ్రణతు లొనర్తున్. **207**

సీ. విమలయోగీంద్రసంఘమునకు నెవ్వాని యకలంకసుజ్ఞాన మాటపట్టు
జనదృక్చకోరకసమితికి నెవ్వానిహాసనాస్యము సుధాపానపాత్ర
సకలసజ్జనసమాజమునకు నెవ్వానిబాహుదండంబులు పట్టుఁగొమ్మ
లాశ్రితశ్రేణి కేయనఘునిపాదరాజీవయుగ్మంబులు చేరుగడలు

తే. అట్టిలోకైకపూజ్యున కాద్యునకును
సచ్చిదానందమూర్తికి సర్వరక్ష
కునకు నాద్యంతశూన్యున కనఘునకును
బ్రణతి గావింతు నెంతయు భక్తితోడ. 208

సీ. ఎవ్వాఁడు నిఖిలభూతేంద్రియాత్మయు మనోమాయావలంబనమహితకర్త
బద్ధుఁడై వర్తించుపగిది దందహ్యమానం బగుజీవచింతనమునందు
నవికారుఁడై శుద్ధుఁడై యఖండజ్ఞానమున నుండువానికి ముఖ్యచరితు
నకు నకుంఠితశౌర్యునకుఁ బరంజ్యోతికి సర్వజ్ఞునకుఁ గృపాశాంతమతికి

తే. గడఁగియుఁ బ్రకృతిపురుషులకంటెఁ బరముఁ
డయినవానికి మ్రొక్కెద నస్మదీయ
దుర్భరోదగ్రభీకరదుష్టపాప
వేదనలఁ జూచి శాంతిఁ గావించుకొఱకు. 209

సీ. విశ్వజన్మస్థితివిలయంబు లెవ్వానివలన నేర్పడు నసువర్తనమున
వ్యావర్తనమునఁ గార్యములం దభిజ్ఞుఁడై తాన గా జగుచుఁ జిత్తమునఁ జేసి
విజ్ఞానతేజంబు విదితంబు గావించె నెవ్వఁడు బుధులు మోహింతు రెవ్వ
నికి నెండమావుల నీటఁ గాచాదుల నన్యోన్యబుద్ధి దా నడరునట్లు

ఆ. త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము
భంగిఁ దోఁచు స్వప్రభానిరస్త
కుహకుఁ డెవ్వఁ డతనిఁ గోరి చింతించెద
ననఘుఁ బ్రత్యుఁ బరుని ననుదినంబు 210

ఆ. వరద! పరమపురుష! హర! సచ్చిదానంద!
భక్తదుఃఖనాశ! స్వప్రకాశ!
యవ్యయాప్రమేయ! యనిశంబు గావింతు
భక్తితోడ నీకు వందనములు. 211

ఆ. పరమపురుష! భక్తవరద! స్వతంత్రి! వి
జ్ఞానమయ! మహాత్మ! సర్వపుణ్య
పురుష! నిఖిలబీజభూతాత్మక! బ్రహ్మ!
నీకు వందనంబు నిష్కలంక! 212

తే. నిర్వికార! నిరంజన! నిష్కళంక!
నిరతిశయ! నిష్క్రియారంభ! నిర్మలాత్మ!
విశ్వసంభోద్య! నిరవద్య! వేదవేద్య!
పరిమలానంద! నీ కిదె వందనములు 213

తే. ఆర్థి భవదీయపాదంబు లాశ్రయింతు
మహితభక్తిని నీకు నమస్కరింతు
భక్తజనపోష! పరితోష! పరమపురుష!
పరిమలాకార! సంసారభయవిదూర! 214

ఆ. ఆర్తజనుల మమ్ము నరసి రక్షింపు మ
హాత్మ! భక్తజనభయాపహరణ!
నిన్ను మది నుతించి నీకు మ్రొక్కెదము నీ
చరణయుగము మాకు శరణ మనఘ! 215

తే. సత్త్వగుణమున సద్భక్తి సంభవించు
భక్తియుతముగఁ జిత్తంబు భవ్య మగును
హృదయపద్మమునం దోలి నెలుఁగఁబడిన
యట్టినీకు నమస్కార మయ్య వరద! 216

తే. తవిలి శశ్వత్స్వరూపచైతన్యభూరి
మహిమచేత నపాస్తసమస్తభేద
మోహుఁడ వఖిలవిజ్ఞానమునకు నాశ్రి
యుండ వగునీకు మ్రొక్కెద నోపరేశ! 217

మ. పురుషాధీశ! భవత్పదాబ్జయుగళీపూజాదికర్మక్రియా
పరతం బొందనిమూఢచిత్తునిఁ బకుపాత్రియుఁ మనుష్యాధముఁ
జరయుఁ నాశము నొందఁ జేయ నతిదక్షం బైనకాలంబు త
ద్గురుకాలాత్ముఁడ వైననీకు మది సంతోషంబునఁ మ్రొక్కెదఁ 218

గీ. ఆశలను ద్రోసి నిర్మలం బైన మనసు
కాయకష్టంబువలనను గలుగుధనము
సంతరించుట సజ్జనసమ్మతంబు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 24

గీ. మగువలవిలాసములఁ జూచి మరులు గొనుట
పాడి గా దని నమ్ముమి భావమందు
పరసతులఁ గూడ నెంచుట పాప మండ్రు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 25

గీ. ధనము నార్జించినన్నాళ్లు దరికిఁ జేరి
గారవింతురు మిత్రులుఁ గన్నవారు
జీవములు దేహమును బాయఁ జేరఁ డొకఁడు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 26

గీ. ఉసురులు శరీరము నుండ నుత్సవమున
కుశల మరయుదు రింటిలోఁ గొలుచువారు
జీవ మెడబాయ భార్యయుఁ జేర రాదు
మూఢుఁడా! వేషభాషల మురియఁబోకు. 27

గీ. ధన మనర్థము తలఁపంగఁ దనువు బొగ్గు
శత్రుమిత్రకళత్రసంచయము లెల్ల
గగనకుసుమంబు లట్టిద గౌరవంబు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 28

గీ. బాల్యమున నాటపాటలఁబడి చరించి
జవ్వనంబున యువతులసరసఁ జేరి
ముదిమి మతి దప్పి యుందువు ముం దెఱుఁగక
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 29

గీ. కలిమి గలనాఁడు సౌఖ్యంబు గలిగె ననుచు
లేమి గలిగిన దుఃఖంప లే నటంచు
నీవు మదిలోనఁ దలఁచుట నెఱితనంబె
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 80

గీ. సకలసద్గుణసంపత్తి సతితరింప
మరణకాలంబునందు నిర్మలము నందఁ
చిత్తమును బరిశుద్ధిఁ గాఁ జేయు వలయు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 81

గీ. మానసము నంటికొన్నదుర్మలిన మెల్లఁ
దుడిచివేయంగవలె నన్న దుండగంపు
మార్గముల రోసి బ్రతుకుట మంచి దనిరి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 82

గీ. ఎల్లజనులను నొకరీతి నెంచుచుండి
పేదలను తృప్తులుగఁ జేసి ప్రేమఁ జూపి
కష్టపడి జీవనము సేయఁ గలుగు సుఖము
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 83

గీ. దేహమును నమ్ముకొనఁబోకు తెవులుగొంటు
లోకమును నమ్మ దుఃఖంబు లోఁగి యుండు
జీవ మది చంచలం బని చెప్ప వినవె
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 84

గీ. పండితులసన్నిధిని జేరి పలుక నీవు
విమలవిజ్ఞానవేత్త వై వెలయ లేవు
ధర్మసత్యశౌచంబులఁ దాల్ప లేవు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 85

తే. ఏటియొడ్డున మొలచిన * వృక్ష, మితర
హస్తగత మైనసొమ్ము, లో * లాక్షివశము
పడినకార్యము వ్యర్థ మై * చెడును గాన
దీని నెఱిఁగి నరుండు వ * ర్తింపవలయు. 72

ఆ. కఱవుగొట్టుదేశ * మరిగి ధనంబును,
వెడఁగుకొడుకుఁ బడసి * పితృవిధులును,
జెడిపె నాలు నొంది * వెడఁదసుఖంబును
బొందలేడు నరుఁడు * భూతలమున. 73

తే. నూతినీళ్లు, వటచ్ఛాయ, * నూత్నయౌవ
నాంగనయు, నిటుకగృహము * నవనిలోన
శీతకాలములందునఁ * జేయు నుష్ణ
ముష్ణకాలములఁ శీత * మొసఁగుచుండు. 74

క. తెలియం జదువనివిద్యయు,
నలఁగ కజీర్ణమున భోజ * నంబును, లేమిన్
గలవారిగోష్ఠి, వృద్ధున
కలరెడుతరుణియు విషంబు * గద తలపోయన్. 75

తే. అర్థ మార్జించుటే దుఃఖ; * మార్జితార్థ
మరసి రక్షించు టొకదుఃఖ; * మంతమీఁద
నాయమందును వ్యయమందు * నధికదుఃఖ;
మకట! దుఃఖాకరం బగు * నర్థ మవని 76

తే. తల్లి సత్యము, జ్ఞానము * తండ్రి, ధర్మ
మనుఁగుఁదమ్ముఁడు, దయ మిత్ర, * మరయ శాంతి
కాంత, పుత్రకుఁ డోరిమి * గాఁగ నుత్త
మునకు నార్వురుచుట్టముల్ * దనరుచుండ్రు. 77

క. ప్రాణంబు గోలుపోయియు
మానము రక్షింపవలయు * మనుజున కిల నా
ప్రాణం బొకింతలోనిది
మానం బాచంద్రతార * మండన మరయన్. 78

తే. తను వనిత్యంబు, విభవంబు * తరలు నదియు,
నిత్యమును సన్నిహిత మయి * నెత్తిమీఁద
మృత్యు వాఁడుచునుండు; న * ట్లెంచి నరుఁడు
ధర్మసంగ్రహ మొనరింపఁ * దగు ధరిత్రి. 79

ఆ. అరయ మేడిపూవు * లైనఁ, దెల్లనికాకి
యైన, నీట మీను * నడుగు లైనఁ
గానవచ్చుఁ గాని * కలికిలోపలిగుట్టు
కానరాద యెట్టి * ఘనుని కైన. 80

తే. ధనమునకు బందుగులు గురు * జనులు లేరు;
కామమునకు భయము సిగ్గుఁ * గానరావు;
విద్యకును సుఖమును నిద్ర * వెలయఁబోవు;
క్షుధకు రుచియును బక్వంబు * గుదురఁబోవు. 81

తే. ఆయువును, విత్తమును, గృహ * మందుఁ దగువు,
మంత్ర, మౌషధమును, సంగ * మంబు, మఱియు
దానమానావమానముల్ * దాచవలయుఁ
బ్రాజ్ఞుఁ డీతొమ్మిదింటిని * భద్రముగను. 82

తే. ఉత్తమము స్వార్జితం బగు * విత్త మరయ;
మధ్యమమ్ము పిత్రార్జిత * మయినవిత్త;
మధమ మనుజార్జితం బగు * నట్టివిత్త
మాఁడుదానివిత్త మ్మధ * మాధమంబు. 83

క. ధర నాత్మబుద్ధి సుఖ మిడుఁ;
గురుబుద్ధి మఱెంత సుఖము * గూర్చెడుఁ దెలియన్
బరబుద్ధి చెడు గొనర్చెడుఁ;
హరిణేక్షణబుద్ధి ప్రళయ * మై హాని యగున్. 84

తే. కనినయంతన చిత్తమై * కల్గ మొదవు;
ముట్టినంత ధనక్షయ * మ్మట్టె వచ్చుఁ;
గూడినంతఁ గిల్బిషము చే * కూరు; వార
రమణు లారయఁ బ్రత్యక్ష * రాక్షసు లిల. 85

క. వరమతి, ధైర్యము, సాహస,
మురుశక్తి, పరాక్రమంబు, * నుత్సాహ మ్మే
నరునందుఁ బరఁగుచుండునొ
పరమేశుం డతనియందె * పరఁగుచు నుండున్ 86

తే. త్రాతిపై నున్నగంధంబు * త్రాసికొన్నఁ,
బిల్లిమెంగిలి తిన్నను, * నీళ్లలోన
నున్నప్రతిబింబమును జూచు * కొన్న, నిందు్ర
నంతవానికి నైశ్వర్య * మది తొలంగు. 87

తే. పరుల కనుకూల, పరిహాస * భాషిణియును,
జగడగొండియు, దొంగయు, * మగనికన్న
మున్న తినునది, పొరుగిల్లు * వోవునదియు
మగువ విడఁదగు దశపుత్రి * మాత యైన. 88

తే. పిల్లవాండ్రును, నాండ్రును, * బృధ్ధివిపతులు,
నతిథులును, నల్లురును, దమ * కవియు నివియు
తెమ్ము తెమ్మండ్రు గాని గృ * హమ్ముఁ దీర్చు
నతనికడ విత్త ముండుట * నరయ రకట. 89

క. ఆడెడునప్పుడు, గీతము
వాడెడునప్పుడును, గలన, * వ్యవహారమునన్
గూడు మెసంగెడునప్పుడు
వీడం దగు సిగ్గు హృదయ * వీధిన్ జనముల్. 90

క. కులగోత్రంబులు గలిగిన,
బలవంతుం డైన, రూప * వంతుం డైనన్,
సలలితవిద్యాగంధము
గలుగనిమానవుఁడు కింశు * కమువలె విత యూ. 91

తే. నదులు తమనీరు త్రాగవు; * నగము లెల్లఁ
దమఫలంబులు తినవు; మే * ఘములు తమజ
లములఁ బెఱిఁగిన సస్యముల్ * నమల వవని;
సుజనులవిభూతు లొరులకై సువ్వె తెలియ. 92

క. నాయకుఁడు లేనికార్యము,
నాయకు లై శిశువు జముఁడు * నారియుఁ గలుగన్
బాయనికార్యము మఱి బహు
నాయక మగుకార్యమును వి * నాశ మగు నిలన్. 93

తే. విద్య యభ్యాసమునుబట్టి * వెలయుచుండు;
బుద్ధి కర్మానుసారి యై * పొసఁగియుండు;
లక్ష్మి యుద్యోగమునుబట్టి * లలి వెలుంగు;
ఫలము భాగ్యానుసారి యై * ప్రతిభఁ గాంచు. 94

తే. ఋణము చేసినతండ్రియు, * గుణము లేక
వ్యభిచరించినతల్లియు, * సభల మెచ్చ
నగుచదువు లేక కడుమూర్ఖుఁ * డైనసుతుఁడు,
రూపవతి యైనయాలు శ * త్రువులు దలఁప. 95

# సౌఖ్యజీవనము.

గీ॥ సతతపరజనచిత్తానుసరణ మూని
యాత్మబుద్ధికిఁ దోఁచినయటులఁ జేసి
సత్ప్రవర్తనమే కవచముగఁ దాల్చి
నిష్కపట మైనన్యాయమే నేర్పు గాఁగ
మనెడునాతఁడె సౌఖ్యజీవనుఁడు జగతి.

గీ॥ అంతరింద్రియశక్తుల నణఁచివైచి
లోకవ్యవహారచింతలలోఁ దగులక
యశ మనెడులలితాంగిమోహమునఁ బడక
మృతికి సంసిద్ధుఁ డగుచు సంతతము మెలఁగి
మనెడునాతఁడె సౌఖ్యజీవనుఁడు జగతి.

గీ॥ అన్యమానవశ్రేయస్సహనము విడక
సదధికారంబు కలిగిన మదముఁ గనక
దురితకార్యాచరణము నెందును దలఁపక
స్తోత్రపాఠంబులకును సంతోషపడక
మనెడునాతఁడె సౌఖ్యజీవనుఁడు జగతి.

గీ॥ విధివిధాయకముల నెఱవేర్చునపుడు
జనులవాక్యంబులకు సుంత జంకఁ బోక
అంతరాత్మయె తనదుష్కృత్యముల కెపుడు
ఘన మయినసాక్షి యనునమ్మకంబుతోడ
మనెడునాతఁడె సౌఖ్యజీవనుఁడు జగతి.

గీ॥ అనుదినంబును దైవప్రార్థనముఁ జేసి
వరములను గాక యాతనికరుణఁ బడసి
లోకమున కపకారంబు లేకయుండ
హితులతోడను సద్గ్రంథతతులతోడ
మనెడునాతఁడె సౌఖ్యజీవనుఁడు జగతి.

గీ॥ సేవకావృత్తి యనుదానిచింతఁ జనక
రాజ్యములు లేక తనకుఁ దా రాజె యగుచు
కలిమిలేముల నొకరీతిగాఁ దలంచి
శూన్యుఁ డయ్యును సర్వసన్మాన్యుఁ డగుచు
మనెడునాతఁడె సౌఖ్యజీవనుఁడు జగతి.

# ప్రకృతివిలసనము.

చ॥ సలలితనీలవర్ణశిలసన్నిభ మైననభంబునందుఁ దా
రల మెఱపించి మించుతిమిరంబును రూపడఁగించి కాంచనో
జ్జ్వలజలజాతపుంజములఁ బ్రజ్వలతన్ దొలఁగించి వేడ్కతోఁ
గలువలతేఁచు వెన్నెలలఁ గాయును మోదముతోడ నైక్యమై.

చ॥ జలకము లాడు తామరలచాడ్పున ప్రేక్షణమాలికావినో
జ్జ్వలసితమండలంబులు భృశంబుగఁ దన్నిజనాథుపైఁ దమిన్
జిలుముచుఁ జంచలేక్షణలు చిత్రిలసత్పరిరంభసంభ్రమం
బులను వెలార్చునప్పుడు ప్రమోదము లీనము జెందు కాంతితోన్.

ఉ॥ వారనిప్రేమ లూరు వనవాటికలన్ జెలువారు చారుకా
సారములన్ మృణాళములు చాచి సరోజములన్ వెలార్చు సిం
గారము మీఱునప్పు డళి గానముసేయుచు నున్నయప్పు డిం
పారురసంబు మోదమున నైక్యము నొందు విలాస మేర్పడన్.

చ॥ అరవిరులందు సూర్యకిరణావళి బంగరుమేలిపూతలన్
బరపి నవీనసౌరభము పాదుకొనన్ బచరించి సంధ్యలం
దరుణవిలాసకాంతుల నజాండము ముంచి ప్రచండదీధితుల్
తొరగి మనోహరం బగుచుఁ దోచు రసం బెనయించి కాంతితోన్.

చ॥ అలిగి లతాంగి వెండియు దయారస ముప్పతిలంగ నాథుపైఁ
గలిగినప్రేమఁ బట్టుక వికాసముఖాబ్జమునందు లేతన
వ్వొలయ నొయారమున్ వెలికి నుమ్మలికమ్ముగ సంతరించి క
న్గొలుకుల నీరు నించుతఱిఁ గూర్కొను హర్షముతోడఁ దేజమున్.

# మధుకరము

తే॥గీ॥ పుష్పపుష్పన కెగయుచుఁ బుష్పతేనె
వలసినది స్వేచ్ఛమైఁ గడుపారఁ ద్రావి
రామణీయక మమర నారామభూమి
మనుదు వెప్పుడు హాయిగా మధుకరంబ!

తే॥గీ॥ పరుల వేడక దైన్యంబు పాలుపడక
తిరుగుదు వయారె మధుకర! దివ్యగీత
తతులు పాడుచును పవనతతుల; సౌఖ్య
జీవనం బన్న నీయదే జీవనంబు

తే॥గీ॥ అరుగవలె నన్న దొరకదా యాశ్రయంబు?
నిలువవలె నన్న దొరకదా నెలవు నీకు?
దీనవృత్తి గదా యని దిగవు గాక
మేలు నీబుద్ధి నే మన బోలు భృంగ!

తే॥గీ॥ ప్రజలు చలచిత్తుఁ డని నిన్ను బలికి రేని
పలుకనీ దాన నీ కేమి పరిభవంబు?
అవని స్వాతంత్ర్యమే స్వర్గ మన్నమాట
మాత్ర మొక్కటి మఱువకు మదిని మధుప!

తే॥గీ॥ లలితసౌరభసారసరాజియందు
మధురమకరందభరితసుమంబులందు
కలితగంధేభమదసిక్తకటములందు
సంచరింపుము స్వేచ్ఛఁగాఁ జంచరీక!

# ఎనిమిదవ ప్రకరణము

అంతట ఢిల్లీలో హుమయూన్ పాదుషా దర్బారు తీర్చికొనియుండెను. పేర్వోబు ప్రతినిధులు సామంతరాజు లాదర్బారు నలంకరించిరి. అయ్యెడ అజాఫ్ ఖానుఁడును వచ్చియుండెను.

చక్రవర్తి రాజ్యాంగవిషయము లెట్లున్న వని యొకరొకరిని నడిగి తగుసమాధానములను బడయుచు, బుందేల్‌ఖండముసంబంధ మగుసమాధానములు కోరవలసినకాగితము లే మున్న వని యొకముసద్దీ నడిగె. అందుపై నతఁడు దస్తరము విప్పి యొకకాగితము నెదుటఁ బెట్టెను. అయ్యది తనకుమార్తెను అజాఫ్ ఖానుఁడు తనకు వివాహము సేయుమని యక్రమముగా రాయబార మంపినాఁ డనియు, చక్రవర్తిగా రాతనిని మందలించనిచో స్నేహధర్మమునకు భంగము గలుగు ననియు, కనోజురా జగు చందనుఁ డిచ్చుకొన్న యర్జీ.

చక్రవర్తి యాకాగితమునందలియంశములకు సమాధాన మిమ్మనీ కోరఁగా నందలి యంశము లసత్యము లనియు, చందనుఁడు చిత్తూరురాణితోఁ గూడి మొగలాయీలపై దండెత్తుటకు యత్నించుచున్నాఁ డనియు, అందుచే విక్రమాజితునకుఁ దనకుమార్తెను వివాహము సేయఁ బోవుచున్నాఁ డనియు, వారిప్రయత్నములను భంగపఱుపఁ జూచు తనపై నతఁ డసహనముచే నట్టితప్పుటర్జీ యిచ్చియున్నాఁ డనియుఁ జెప్పి అజాఫ్ ఖానుఁడు, నిదర్శనముగా నీయుత్తరమును జూడుఁడు. దీని నెన్నియోప్రయత్నములు చేసి సంగ్రహించినాఁడ నని యొకయుత్తరమును జూపెను. అయ్యది చక్రవర్తిగారికడ నిటు చదువఁబడెను:—

మేవాడ్ సంస్థానాధ్యక్షులు గంగాభగీరథీసమానురా లగు శ్రీజవాహిర్ బాయి రాజ్ఞిగారిసముఖమునకు—

విధేయుఁడు చందనుఁడు నిరంతర మనేకనమస్కారములు:—ఉభయకుశలోపరి.

సోదరీమణీ!

ఇదివఱకు వ్రాసియుండినజాబులవలన సంగతు లన్నియు మీకుఁ దెలిసియే యున్నవి. ఇప్పుడు వ్రాయువిన్నప మేమన, మీవంటివీరవనితకుఁ బుత్త్రుఁ డైన శ్రీయుతు లగుచిరంజీవి విక్రమాజితరాణావారికి మత్పుత్త్రికారత్నమును సమర్పించి మీతో వియ్యమందునంతటిభాగ్యము నాకు లభించినందుల కెంతయు సంతసించితిని. ఇంతటినుండి మనబాంధవము మిక్కిలి దగ్గఱ దైనది గనుక, మనయుభయకుటుంబములవార మన్యోన్యసంప్రేమములు గలిగి యొకరి కొకరము శత్రుసంహారణకాలమునఁ దగుసాహాయ్యము లొనర్చుకొనుచు మ్లేచ్ఛులబాధలు లేక సుఖతరంబుగ నుందుము గాక!

మ్లేచ్ఛులదౌర్జన్యము లెక్కువగ నుండుటవలన మీ రిటకు వచ్చి వివాహము జరిగించుకొనుటకుఁ గాని, మే మక్కడకు వచ్చి జరపుటకుఁ గాని వీలులేనందునఁ గన్యకను మాత్రము మీసముఖమునకుఁ బంపితిని. కావున శుభముహూర్తము మీరే యేర్పఱచికొని వివాహము జరిగించుకొనవలె నని ప్రార్థించుచున్నాఁడను. మీరు పెండ్లికొమరితకు మేనత్తలు గావున నేను లేనిలోప మెంతమాత్ర ముండనేర దని భావించెదను.

ఇప్పుడే కన్యను మీయధీనము చేసియున్నందున నామెబాధ్యత యంతయు నింతటినుండి మీయదే.

చిత్తగించవలెను.

విధేయుఁడు,

చందనుఁడు.

అట్లు చదువఁబడినయుత్తరమునందలియంశములు అజాఫ్ఖానుఁడు చెప్పినసమాధానమునకుఁ గొంతవఱ కనుగుణ్యముగ నుంటవలనను, ముఖ్యముగాఁ గళింజర్ ముట్టడియందుఁ దనకు సాహాయ్యము చేసినమోమోటమువలనను, చక్రవర్తి అజాఫ్ఖానుని క్షమించి, యర్జీని బుట్టదాఖలు గావించెను. అనంతరము అజాఫ్ఖానుఁడు చిత్తూరకనోజులపైకిఁ జక్రవర్తిని బురికొల్ప నెన్నియోప్రయత్నములు చేసెను గాని సదయుఁడైనయాతఁ డెంతమాత్ర మియ్యకొనలేదు. అంత అజాఫ్ఖానుఁడు విఫలమనోరథుఁడై కళింజర్పురమునకుఁ బోయెను.

# తొమ్మిదవ ప్రకరణము.

విజయసింగు మధ్యహిందూస్థానమునందు మివాడ్ సంస్థానమునకు సామంత రాజుగ నుండెను. ఆకాలమున మేవాడ్ సంస్థానాధీశుఁడు సంగరాణా. మహమ్మదీయ దండయాత్రలలో సంగున కాతఁడు సహాయకారిగ నుండెడివాఁడు. క్రీ. శ. ౧౫౨౭ సం॥లో ఫత్తేపూరుసిక్రీయొద్ద సంగరాణాకును మొగలాయిచక్రవర్తి యగు బేబరునకును జరగినఘోరయుద్ధమున విజయసింగుని శౌర్యాగ్ని సెగ్గఁగఁ బ్రజ్వరిల్లి మొఘలులఁ జాల వణకు వంచించెను. కాని బేబరు చేసినకృత్రిమయుద్ధమువలన నెట్టకేలకు సంగరాణా కపజయము గలిగినది. తరువాత బేబరు చిత్తూరు నెన్నటి కైనఁ దనస్వాధీనము చేసికొన నెంచి, విజయసింగుని దౌలత వంచింపక యాపని దుస్సాధ్యం బని యెంచి ౧౫౨౮ సం॥లో చెందేరిదుర్గమును ముట్టడించెను.

అయ్యెడ విజయసింగతిసాహసంబునఁ బోరాడెను. కాని మొఘలసైన్య మపారముగ నుండుటఁజేసి యాతనిశౌర్యము దివ్వటీముందు దీపమువలె వ్యర్థ మయ్యెను. బేబరు విజయసింగుని జంప యత్నించెను గాని సాహసవంతుఁ డైనయాతఁడు ప్రాణాపాయమును జెందక యొకవ్రేలిని మాత్రము గోల్పోయి తప్పించుకొని పాఱిపోయెను.

అంతటినుండి పాపము రాజ్యభ్రష్టుఁ డైనవిజయసింగునకుఁ గష్టపరంపరలు వెంటఁ దగిలినవి. భార్య కాలధర్మము నొందెను. పుత్రసంతతి లేదు. ఆతనికి సౌభాగ్యవతి యనునొక్కపుత్రిక మాత్ర ముండెను. సుతులు లేనివాఁ డగుటచే నాపుత్రిక నాతఁడు సుతునివలె భావించి, చిన్నతనమున సంగీతసాహిత్యవిద్యలే కాక యస్త్రశస్త్రాది పురుషవిద్యలు కూడ నేర్పించి యతిగారాబమునఁ బెంచి యుక్తవయస్కురాలు కాఁగాఁ బెండ్లి చేసి యావలికే యత్తింటికిఁ బంపి యుండెను. ఇంక నాతఁ డేకాకి యై భికారివానివలె నుండుటకు దైవము విధించెను. తనను జూచి మందభాగ్యుఁ డని యెల్లరు నిరసించెద రనియు, సంభవించినకష్టములచేఁ గలిగిన వైరాగ్యమువలనను, సన్యాసివేసముతో నందందఁ దిరుగుచుఁ గాలక్షేపము సేయుచుండెను. కావున నాతఁడు మరణించె నని యెల్లరు నభిప్రాయపడిరి.

కూటికిఁ బేదఱిక మైనను గులశౌర్యములకుఁ బేదఱికము లేదు కావున రసపుత్ర వీర్య మింకను విజయసింగును బెడఁబాయలేదు. అట్లు ప్రచ్ఛన్నవేషముతో నాతఁడు సంచారము సేయుచుండఁ గొంతకాలమునకుఁ దనకుమార్తెను గనోజురాజు చందనుఁడు నిష్కారణముగ గంగలోఁ ద్రోసి చంపినదుర్వార్త విని దుఃఖితుఁడై యల్లునిపైఁ గసి దీర్చుకొనుటకుఁ గనోజుపట్టణమున వసించి సమయమును నిరీక్షించుచుండెను. చందనుని యదృష్టవశంబున నొకయోగిని వానియుద్దేశమును మరలించెను.

# పదియవ

ఒక్కదినంబున మీవాడ్ దేశపురాణి జవాహిరుబా [illegible] కుమారుడు విక్రమా జితునకు వివాహమహోత్సవ మని దేశమునం దెల్లకడలఁ జాటింపఁ జేయుటచే నచ్చటచ్చటఁ గలరాజబంధువులు, సామంతరాజులు, పురోహితులు, విద్వజ్జనులు వేనవేలు చిత్తూరునఁ జేరియుండిరి. చిత్తూరునం దెందుఁ గనుఁగొన్నను ముత్యాలరంగవల్లులే. ప్రతిగృహాంగణంబునఁ బచ్చతోరణంబులే. ఎయ్యెడఁ జూచినఁ బూవుఁజప్పరముల నెడ లేనికదళీకాండంబులడంబు లలరారె. వీధివీధిని ధ్వజపటంబు లెగురుచుండె. ఎల్లెడల నగరువాసనలు గుబులుకొనియె. అలంకృతరథగజాశ్వశోభ లభివర్ణింపఁ దరముకాకుండె. పురజనాళి మహోత్సాహముతో సుముహూర్తమునకై యెదురుచూచుచుండె.

అంత సుముహూర్తమునకు నొకగంటకాలము వ్యవధి కలదు. స్త్రీలు వధువును మంగళస్నానము చేయించి యలంకరించిరి. మంగళతూర్యనాదములు చెలంగుచుండె. జన మశేషముగ మహోత్సాహమునఁ జింత యెంతమాత్రము లేక మెలంగుచుండఁ బెండ్లికూతురుమనంబున కుత్సాహ మనునది లేకపోయెను.

అయ్యెడఁ బ్రాసాదద్వారంబుచెంత నొకయోగిని నిలువఁబడి రాణిగారికిఁ దన రాక నెఱింగింపు మని యొకపణిహారుని లోనకుఁ బంపె. అంత లోననుండి రాణిగారి యనుమతి రాగాఁ బ్రాసాదాంతరమునకు నరిగి యాయోగిని రాణిగారిదర్శనము గావింప నామె «అమ్మా! మీర లెవరు? వచ్చినకార్యార్థ మేమి?'' యని యడుగ «అమ్మా! నే నొకయోగినిని. పెండ్లికుమార్తెకుఁ దండ్రిగారియింటివద్ద నున్నకాలమున సంగీతవిద్య నేర్పినదానను. అందుచే నా కామె శిష్యురాలు. తాను వచ్చుటకు వీలులేక మారాజుగారు పెండ్లికుమార్తెతో నుండు మని నన్నుఁ బంపినారు. ఆమె యెచ్చట నున్నది?'' యని వచించెను. అందుపై రాణి పెండ్లికుమార్తెకడకు «నీకు సంగీతవిద్య నేర్పినయోగిని వచ్చినది- ఆమెను నీ వెఱుంగుదువా?'' యని వర్తమానము చేసెను. ఆవర్తమానమువిని పెండ్లికూతురు పట్టరానిసంతోషముతో «ఆ! యెఱుంగుదును. ఆమె యెక్కడనున్నది?'' అని లోపలిద్వారములో వేచియుండెను. పెండ్లికూతు రెఱుఁగుదు నని చెప్పుటచే రాణి యంతఃపురములోనకుఁ బోవ యోగినికి సెల వొసంగెను. ఆమె తనమాటలతోఁ బ్రవేశించెను.

అనంతర మాయోగిని "అమ్మాయీ! నీకుఁ గుశలమా? నిన్నుఁ జాలదినంబుల క్రిందట విడచి వచ్చితిని. నీవు నన్ను జ్ఞాపకమునం దుంచుకొనినందుకు మిగుల సంతసించితి" నని పెండ్లికుమార్తెను బల్కరించెను. ఆకన్యకయు యోగినిని మనసారఁ గౌఁగిలించుకొని కన్నుల బాష్పవారి యంకురింపఁగాఁ "అమ్మా! నాక్షేమము నీ కే మని యెఱింగింతును. నీవు నన్ను విడచినది మొదలుకొని పెక్కుగష్టములకుఁ బాల్పడితి" నని చెప్పి, తనతండ్రి తన్ను మోసపుచ్చి విక్రమాజితునకు వివాహము సేయఁ గోరి చిత్తూరునకుఁ బంపుటయు, తాను జిత్తూరునఁ బ్రవేశింపఁగనే విక్రమాజితుఁడు తల్లికిఁ దెలియకుండ నేవొక్కచోఁ దన్నుంచి యారాత్రి కామాంధుఁడై కలయ యత్నింపఁగా నర్ధరాత్రంబున వానినుండి తప్పించుకొని వీధిలోఁ బడి యెటకేనిఁ బాఱిపోవఁ బ్రయత్నించుటయు, విక్రమాజితుఁడు మరలఁ దన్ను వెంబడించి నిర్బంధించుటయు, జనార్దనునిచేఁ దాను సంరక్షిత యగుటయు నాదిగాఁ గలదురవస్థ లన్నియు నెఱింగించెను. యోగిని యామె నోదార్చి "అమ్మా! నీదురవస్థలు నే నెఱుంగనివికావు. తల్లికి దూరమైతివి. కావున నీ కీసంబంధము నీతండ్రి గూర్పనెంచినాఁడు. నీసవతితల్లికి నీపైఁ గనికర ముండునా?" యని కొంత విచారించి, "అయినను నీకు వచ్చినభయము లేదు. ఈముహూర్తమునకు వివాహము కాఁగదు. నే నింక నిట నుండరాదు. ఈమాటను జాగ్రత్త చేసికొమ్ము. నీ కన్నివిధముల మేలు నేకూరు" నని చెప్పిపోయెను.

అంతట సుముహూర్తము సమీపించినది. వివాహవేదికచుట్టు బంధుజనులు, సామంతులు, మంత్రులు, పురోహితాదిసభ్యులు వేనవేలు పరివేష్టించియుండిరి. వివాహమండపమునకడ సమస్తసంభారములు సిద్ధపఱుపఁబడెను. ఆహా! మనుష్యప్రయత్నములు నిష్ప్రయోజనములు గదా? ఒక్కనిమసమునకు రాఁబోవుమేలుకీడు లెవ్వ రెఱుంగుదురు? విస్తరిలోనిసిద్ధాన్నము భుజించువఱకు మనది యని చెప్పుటకు వీలు లేదు. అందుచేతనే పెద్దలు ప్రాప్త ముండవలె నందురు. చెప్పుచుండఁగనే మన, నాబాలగోపాలము జను లట్లు మహోత్సాహులై యుండ నొక్కపెట్టునఁ బురిచెంత రణభేరి మ్రోగెను. ఫిరంగిచప్పుడులు వినఁబడెను. అంతట విక్రమాజిత జవాహీరుబాయిలహృదయంబులు తల్లడిల్లె. వైవాహికసభ కళవళపడి తత్క్షణమే యథాయథ లయ్యె. కోటలోఁ బెద్దకలవరము సంభవించె. ఒకరిజాడ యింకొకరికి లేదు. భర్తలు భార్యలను మఱచిరి. తల్లులు చంటిపిల్లలను మఱచిపోయిరి. గర్భవతులకడుపులోని పిండములు చలించె. ఎల్లరకుఁ బొందలోఁ బ్రాణములు నిలుచు నన్నయాసలు వాసె.

ఏది యెట్టు లైనను విక్రమాజితునకుఁ బెండ్లికూతురిపై నాశాపాశ మింకను దెగలేదు. కావున నతఁడు పెండ్లికూతురిని భయమునుండి జాగ్రత్తగాఁ గాపాడు డని యిరువురితోఁ జెప్పెను గాని వారి కామె యేమూల నున్నదో యాగందరగోళములోఁ గనఁబడలేదు. వారిప్రాణములు వారు కాపాడుకొనుటయే దుస్తరమయ్యె. విక్రమాజితుఁడు విధి తప్పదు కావున శత్రుసేనలను గొంతదూర మెదురు సని యెదిరింపఁ బోయెను. జవాహీరుబాయి కోటయొక్కముఖద్వారమునఁ గాపునకై నిల్చె.

చిత్తూరుకోట నేలమట్టమునకైదువందలయడుగులయెత్తైనమెట్టపైఁ గట్టఁబడి మూఁడుంబావుమైళ్ళపొడవును నఱమైలువెడల్పును గలిగి యాఱువందలతొంబది యకరముల నేల నావరించుకొనియున్నది. భేరీధ్వానంబులకుఁ దలఁకి పాఱిపోయినవారు గాక సుమారు నలువదివేలజను లయ్యెడఁ గోటలో నుండిరి.

అంతట నేల యీనినట్లు చితోడ్ దుర్గద్వారంబుచెంతఁ దురకదండ్లు త్రివ్వ తండంబులుగ గెలకొనియుండె. భేరీనాదంబులచే దిగంతములు ప్రతిధ్వను లీనుచుండె. అశ్వదళపదన్యాసజాయమానటకటకధ్వనులు భూకంపమును గలిగించుచుండె. గజబృంహితంబులు ధీరులగుండెలు భేదించుచుండె. భటకోటులు పాదరక్షలపై నడువ నడుగడుగునకుఁ బుడమి దిగఁబడుచుండె. అట్టివిశాలకోలాహలసంకులంబైనమహాసైన్యచటులపారావారంబునడుమ మణిగణస్థగితచారుతరకోటీరధారియై నాగేంద్రంబు నెక్కి విహరించు శ్రీయుతుఁడే ఘూర్జరప్రభు వగు బహదుర్షా. వానికిఁ గుడిప్రక్క నున్న యశ్వారోహకుఁడే యజాఫ్ ఖానుఁడు. వాని ననుసరించి తురంగము నెక్కియున్న లేఁబ్రాయపుమనోహరాకారుఁడే దుల్పట్ షా. సేనకు ముందువెనుకల నున్న గడ్డముగల ముసలివారే రహిమాన్ అబ్దుల్ ఖానులు.

అప్పు డుదయమువూట సుమారుజాము ప్రొద్దెక్కినది. మ్లేచ్ఛసైన్యములు చిత్తూరుగవమును ముట్టడించెను. అట్టియాకస్మికపుశత్రువును గలనైన నిరీక్షించి యుండకపోయినను, జవాహిర్ బాయి సహజపరాక్రమశాలిని గావున గవచధారిణియై గుఱ్ఱముపై నెక్కి పడమరకుఁ బొద్దువ్రాలుపర్యంతము వైరులకుఁ జొఱ నెడమీయక దుర్గద్వారమును గాపాడెను. రాజపుత్రవీరులు పెక్కండ్రు తమలోఁ దమకుఁ గల కార్పణ్యములను దిగఁద్రోసి చిత్తూరును గాపాడఁ గంకణము కట్టుకొని నలుదెసలనుండి వచ్చిరి. తురకలు కోటలోఁ బ్రవేశించుటకు విశ్వప్రయత్నములు చేయుచుండిరి.

రసపుత్రులు కోటకొమ్మల నెక్కి మ్లేచ్ఛసైన్యంబులపైఁ బలుపల శరవర్షంబులు గురిపించిరి. దానఁ గొందఱు తురకలు కడతేరిరి. దుర్గద్వారమును గాపాడుచున్న రసపుత్రవీరులు చాలమంది తురుష్కులఖడ్గధారాహతిఁ బ్రాణములను గోల్పోయిరి. కొందఱు రక్తసిక్తాంబరధారులై పౌరుషముఁ బెడబాయక హాహారావోహారిని బోటిరి. జవాహిర్ బాయిని సంహరించి దుర్గమునఁ బ్రవేశించుట దుస్సాధ్య మని బహదుర్షా తలంచెను. కాని శతఘ్ను లాదిగాఁ గలయుద్ధసామగ్రులతోఁ దురుష్కసైన్య మపారముగ నుంటచే రసపుత్రులశౌర్యము వ్యర్థ మయ్యె. తురకలు కోటగోడల సొరంగములు చేసి యందుఁ దుపాకిమందు నించి నిప్పంటించి కూలఁజేసిరి. జవాహీరుబాయి వీరశయనమున శయనించుటచే దుర్గద్వారమునఁ దెఱపి యిచ్చెను. అప్పుడు మ్లేచ్ఛసైన్యము నిరాటంకముగఁ గోటలోఁ బ్రవేశించి వెనుకముందులు చూడక శిశువు లనక వృద్ధు లనక చేఁ దొఱకినరసపుత్రుల నందఱఁ బిలుకుమార్చెను. విక్రమాజితుఁడు, నతనితమ్ముఁడైన ఉదయసింహుఁడును నెట్టులో యాపదనుండి తప్పించుకొని పాఱిపోయిరి.

అయ్యెడ అజాఫ్ ఖానునకు మహోత్సాహ ముద్భవింపఁ, దాఁ గాంక్షించిన చంచలాక్షికై యంతఃపురంబులు వెదుకఁ జొచ్చె. అప్పుడు రాణివాసపుస్త్రీలలోఁ గొందఱుమానవతులు తమతనుమకోమలగాత్రంబు లగ్నిహోత్రిన కాహుతులుగ వర్పించిరి. కొందఱుసుందరాంగులు ఖడ్గంబులఁ గంఠంబులు గోసికొనిరి. కొందఱు భామినీమణులు బావులయందుఱికి జీవములు త్యజించిరి. మఱికొందఱుసతీమతల్లులు విషంబులు ద్రావి నారాయణా యని ప్రాణంబులు వీడిరి. ఇట్లు పదుమూఁడువేల రాజపుత్రస్త్రీ లేకకాలంబున దివంబునకుఁ జేరిరి. మొత్తముమీఁద ముప్పదిరెండువేల రసపుత్రజన మానాడు వీరస్వర్గమునకుఁ బోయెను. ఆహా! యేమి విధికృతము! కొన్నిగడియలక్రిందటివఱకుఁ గళ్యాణప్రదంబై విలసిల్లుదుర్గ మిప్పుడు ప్రేతవాటిక యై కన్పట్టె. ఆప్రేతవాటికకు బహదుర్షా వీరబాహునివలె నాయకుఁ డయ్యె. విగతప్రాణలైనస్త్రీలలోఁ 'దాను గామించినమించుబోణి యొకతె యుండు నని అజాఫ్ ఖావించి నిరాశ చెందినవాఁ డయ్యె.

# IX

ధర్మపుత్రుఁడు నదీజలము నోటితోఁ దెచ్చి దగ్ధకాష్ఠములను దడుప నారంభించెను. వాఁడు విశేషశ్రమతో నాతీరున మూఁడుకాష్ఠములను జలసిక్తము గావించి యాయాసముఁ జెంది క్షుదార్తుఁడయి కొంచెమాహారమునిమిత్తము వృద్ధునికుటీరములోఁ బ్రవేశించెను. తలుపు తెఱచియున్నది. వృద్ధసన్యాసి మృతిఁజెంది పడియుండెను. ధర్మపుత్రుఁడు నలువైపులఁ బరికింపఁగ, ఎండినరొట్టెముక్క యొకమూల దొరకెను. దానినిఁ దిని పాఱను వెదకి తీసికొని వృద్ధునిసమాధియందుంచుటకయి నేలఁ ద్రవ్వసాగెను. రాత్రి యంతయు నీరుఁ దెచ్చి దగ్ధకాష్ఠములను దడిపి పగలంతయు నేలఁ ద్రవ్వెను. ఈవిధముగ నాదినము గడచెను. ఇది జరిగినదినముననె గ్రామమునుండి వృద్ధునికొఱ కాహారద్రవ్యములఁ దీసికొని కొందఱుగ్రామవాసులు వచ్చిరి. వారు వృద్ధుఁడు ధర్మపుత్రు నాశీర్వదించి తనస్థానమునకు వాని నధికారిఁ జేసె నని విని వృద్ధుని సమాధిస్థితునిఁ జేసినతరువాత ధర్మపుత్రునికిఁ దెచ్చినరొట్టె లిచ్చి మరల వానికొఱ కాహారముఁ దెచ్చుచుండెద మని నుడివి గ్రామమునకుఁ బోయిరి.

ధర్మపుత్రుఁడు సన్యాసియొక్కకుటీరమున వాసము చేయుచుండెను. జనులు తనకొఱకుఁ దెచ్చినవి భుజించుచు సన్యాసియొక్కయాదేశముప్రకారము నోటితో నీరుఁ దెచ్చి దగ్ధకాష్ఠములను దడుపుచుండెను.

ఈవిధముగ నొకవత్సరము గడచెను. వానికీర్తి నలుదిక్కుల వ్యాపించెను. అతఁడు నోటితో జలము దెచ్చి దగ్ధకాష్ఠములఁ దడుపుచుండు ననెడుసమాచార మందఱు వినోళ్ళ వానినిఁ బొగడుటకుఁ గారణ మాయెను. గొప్పగొప్పవర్తకులు వానివద్దకు వచ్చి కానుకల నర్పించుచుండిరి. అతని కేమి యవశ్యముగఁ గావలయునో దానిని మాత్రమె యుంచుకొని మిగిలినద్రవ్యములను దరిద్రులకు దానము చేయుచుండెను.

ఇట్లు దినములు సుఖముగ గడచుచుండెను. అర్ధదినము నోటితో జలముఁ దెచ్చి దగ్ధకాష్ఠముల సిక్తము చేయుటయందును, తక్కినయర్ధదినము విశ్రమించుటయందును నందఱితోఁ బ్రసంగించుటయందును గడచుచుండెను. ఈవిధముగ జీవనయాపనము చేసిన వృద్ధునియాదేశము పరిపాలింపఁబడు ననియు, అమంగళనాశనము పాపపరిహారము నగు ననియు వాఁడు తలంచెను.

ఇవ్విధమున రెండుసంవత్సరములు జరిగెను. ఈకాలములో నాతఁడు దగ్ధకాష్ఠములకు జలసేకము జేయనిదిన మొకటియు లేదు. కాని యొకటి యయినను బ్రతుక లేదు.

ఒకదిన మాతఁడు కుటీరమునఁ గూర్చుండినప్పు డెవరో వెలువల గుఱ్ఱముమీఁద స్వారిచేయుచుఁ బాడుచుండెను. వానిపాట యాతనిచెవినిఁ బడెను. వానినిఁ జూచు నిమిత్తము కుటీరమునుండి బయటికి వచ్చి యొక శ్రేష్ఠమైనయశ్వముపై విలువగలకీసును జేసుకొని కూర్చుండియున్న బలిష్ఠుఁ డగునొక యౌవనునిఁ గాంచెను. అతనిదుస్తులిరమ్యముగ నుండెను. ధర్మపుత్త్రుఁడు వాని నాపి "నీ వెవఁడవు? ఎక్కడికిఁ బోవుచున్నావు?" అని యడిగెను.

ఆయౌవనుఁడు గుఱ్ఱము నాపి "నే నొకదస్యుఁడను. అశ్వముపై స్వారిచేయుచు నీమార్గమున నడచుపథ్యాణికులను జంపుచుండెదను; నరహత్య యెంతయధికముగఁ జేయుదునో యంతయధికసంతోషముతోఁ బాడుచుండెదను." అని చెప్పఁగ, ధర్మపుత్త్రునిదేహము పులకరించెను. ధర్మపుత్త్రుఁడు "అయ్యో! జనులలో నెంతపాపము, అమంగళ మున్నది? దీని నెట్లు వినాశము నొందింతును? నావద్దకు వచ్చి తమపాపముల నొప్పుకొనువారి కుపదేశము చేయుట సహజము; కాని యీపురుషుఁడు దుష్కర్మతత్పరుఁడయి గర్వించియున్నాఁడు. వీనిని బాగుచేయునుపాయ మెద్ది?" అని లోలోపలఁ దర్కించుకొని యేమియు స్థిరపఱుపఁ జాలక ముఖము ప్రక్కకుఁ ద్రిప్పి నిలువఁబడెను.

"ఇప్పు డేమి చేయుదును? దస్యుఁ డీమార్గములోనిబాటసారుల బాధించుచుండిన, వీనిభయమువలన జను లెవరు నావద్దకు రారు. కాన వారికిని నాకును నష్టము కలుగును. నేను జీవించునుపాయ మిఁక నేమియు నుండదు." అని భావించి ధర్మపుత్త్రుఁడు దస్యునితో ని ట్లనెను. "జనులు నావద్దకు వచ్చి చేసినపాపముల నంగీకరించి పాపపరిహారము చేసికొనుచున్నారు. నీవు హింసించిన, వారు నాదగ్గఱకు రారు.' నీ కీశ్వరునియెడ భయ మున్నపక్షమున, నీవు చేయుచున్నహింసకొఱకుఁ బరితాపము నొందుము. పశ్చాత్తాపముఁ జెందవేని, తక్షణ మిక్కడనుండి వెళ్లిపొమ్ము. ఈవైపున సంచరించుచు నావని కాటంకము కలిగింపకుము. నామాట విననిచో, ఈశ్వరుఁడు నీకుఁ దగినశాంతి జేయును."

దస్యుఁడు నవ్వుచు నిలువఁబడి “నే నీశ్వరునికి వెఱువను. నీయుపదేశము నా కక్కఱ లేదు. నీవు నాయజమానుఁడవు కావు. ధర్మము నీవృత్తి; దొంగతనము నావృత్తి. నీవు ధర్మముద్వారా, నేను దొంగతనముద్వారా పొట్ట నింపుకొనుచున్నాము. అందఱు నేదో విధముగ జీవింపవలెను గదా? నీయొద్దకు వచ్చువృద్ధులకు స్త్రీలకు ధర్మోపదేశములు చేయుము. నాకు నీబోధ యావశ్యకము లేదు. ఈశ్వర ప్రసంగము నాతోఁ దెచ్చినావు గనుక, రేపు నీకుఁ దగినశిక్ష యగును. ఇద్దఱు మనుష్యులు నిన్ను రేపు చంపెదరు. నేఁడే నిన్ను ఖండించివేయుదును గాని యిప్పుడు నాచేతినిఁ గల్మషముఁ జెందించుకొన నిచ్ఛ లేదు. అదృష్టవశమున నీప్రాణములు దక్కినవి. నాయెదుట నిఁక నిలువకుము.” అని చెప్పి భయపెట్టి తనదారినిఁ బోయెను. కాని వాఁ డావైపునకుఁ దిరిగి రాలేదు. తరువాత ధర్మపుత్త్రుఁ డచట నెనిమిదిసంవత్సరము లెట్టియుపద్రవము లేక సుఖముగ నివసించెను.

## X

ఒకదినము దగ్ధకాష్ఠములకు జలసేకముచేసి ధర్మపుత్త్రుఁడు కుటీరమునకు వచ్చి విశ్రమించెను. వాఁడు జనులకొఱకు నిరీక్షించుచు మార్గమువంకఁ జూచుచుండెను. ఆదిన మేలనో యొకరయినను వానియొద్దకు రాకుండుటచే, వాఁడు సాయంకాలమువఱకు నొంటరిగఁ గూర్చుండి విషణ్ణచిత్తుఁడయి యుండ, ఒకటితరువాత నొకటిగ వాని కిదివఱకు సంప్రాప్తించినసకలవిషయములు వానిమనస్సులోనికి రా నారంభించెను. ధర్మమె వృత్తిఁ జేసికొని తాను పొట్టకూటికై పాటుపడుచుండె నని దస్యుఁడు చెప్పినమాటలు స్మరణకు వచ్చినతోడనె, వాఁడు తనజీవితముఁ బరిశీలింపఁ దొడంగెను. “సన్యాసి నా కేమి యుపదేశము చేసెను? నే నేవిధముగ జీవించుచుంటిని? ఆయన నన్నుఁ బాప పరిహారమునకయి కృచ్ఛ్రసాధనఁ జేయు మని చెప్పెను. నే నాసాధనను ఆహారమును సుఖస్థితిని బడయుట కుపయోగించుకొంటిని. ఈ రెండువిషయములందు నా కెంత లోభము పుట్టినది! లోకులు నావద్దకు రాకుండిన, నే నసుఖి నగుచున్నాను.

వారు వచ్చి నన్నుఁ బరమధార్మికుఁడ వని పొగడిన, నేను సంతుష్టుఁడ నగుచున్నాను. ఇట్టిజీవన మెన్నటికి మంగళజనకము కానేరదు. హా! సుఖ్యాతిఁ బడయవలె ననుకోరిక నన్ను విపదగామిఁ జేసినది. నేను పూర్వపాపమునకుఁ బ్రాయశ్చిత్తముఁ జేసికొనక పోవుటయే గాక, నూతనపాపమునఁ దగుల్కొంటిని. నే నీస్థానము విడిచి జనసంచారము లేని యేకాంతస్థలమున నివసించెదను. నేను నిర్జనప్రదేశమున వసించుచుఁ గృతపాపమునకుఁ బ్రాయశ్చిత్తము గావించెదను. నూతనపాపము వర్జించెదను'' అని వాఁడు తలపోసి యొకసంచియందుఁ గొంచెము రొట్టె నుంచుకొని యొకపాలును జేతిలోఁ బట్టుకొని కుటీరము విడిచి వెళ్లిపోయెను. వనమునం దతినిబిడప్రదేశమున నొకగుహాద్రిశ్వ యందుఁ ద న్నెవరు కనుఁగొనకుండునటుల వాసము చేయ నారంభించెను. వాఁడు సంచిని పాలను దీసికొని కుటీరము విడిచి పోవునప్పుడు, దస్యుఁడు వానికిఁ గాన్పించెను. వాఁడు భయఁపడి పలాయనమగుచుండ, దస్యుఁడు వానినిఁ బట్టుకొని పడఁద్రోసి "ఎక్కడికిఁ బోవుచున్నావు? అని యడిగెను. "మానవు లెవ్వరు నన్ను వెదకుట కలవి కాని చోటునకుఁ బోవుచున్నాను.'' అని ధర్మపుత్త్రుఁడు చెప్పగా, దస్యుఁ డాశ్చర్యము జెంది "ఎవరు నీదగ్గఱ నుండనిపక్షమున నీ వెట్లు జీవింపఁ గలవు?'' అని ప్రశ్నించెను. ఆసంగతి ధర్మపుత్త్రునిమనస్సునకుఁ దట్టనె లేదు. దస్యుఁడు చెప్పినప్పుడె యది వాని మనస్సులోనికి వచ్చెను. దస్యుఁ డిం కేమియు మాటాడక గుఱ్ఱమును సాగిపోనిచ్చెను. "దస్యునిజీవితమునుగుఱించి యేమియుఁ దెలిసికొనలేదు. వాఁ డనుతాపమును జెంది యుండవచ్చును. వెనుకటికంటె నీపర్యాయము శాంతశిష్టుఁ డయినటులఁ గాన్పించుచున్నాఁడు. ఈసారి నన్నుఁ జంపెద నని భయపెట్టలేదు.'' అని ధర్మపుత్త్రుఁడు తనలోఁ దా ననుకొని దస్యునిఁ బిలిచి "పశ్చాత్తాపము నొందుము. ఈశ్వరునిచేతిలో నుండి తప్పించుకొని యెక్కడికిఁ బాఱిపోయెదవు?'' అని యడిగెను.

దస్యుఁడు గుఱ్ఱముఁ ద్రిప్పి యొఱనుండి కత్తిఁ దూసి చంపెద నని భయపెట్ట, ధర్మపుత్త్రుఁడు భీతిల్లి వనములోనికిఁ బాఱిపోయెను. దస్యుఁడు వానిని వెంబడింపక "ఈరెండుపర్యాయములు నిన్ను క్షమించినాను. తిరిగి మూడవసారి న న్నెదుర్కొనిన నిన్ను సంహరించెదను'' అని మాత్రము చెప్పి తనత్రోవను బోయెను.

మధ్యాహ్నము ధర్మపుత్త్రుఁడు దగ్ధకాష్ఠములకు నీరుబోయుటకుఁ బోయి యొక కాష్ఠము చిగిర్చియుండుటను జూచెను.

# XI

ధర్మపుత్రుఁ డేకాంతముగ నజ్ఞాతవాసము చేయుచుండెను. అతనివద్ద నున్న రొట్టె యయిపోఁగా, నడవిలోనికందమూలముల భక్షింప నుద్దేశించి యాతఁడు బయటికిఁ బోయి మూలముల వెదకుచుండ, నొకవృక్షశాఖను వ్రేలాడుచున్నయొకసంచిలో రొట్టె కాన్పించెను. ధర్మపుత్రుఁడు సంచినుండి రొట్టెను దీసి తనయాహారమునకొఱకుపయోగించెను.

ఆరొట్టెయు నయిపోయినతరువాత, నాతఁడు తిరిగి యాచెట్టువద్దకు రాఁగా, వెనుకటివలె సంచియందు రొట్టెను గనుఁగొనెను. ఈవిధముగ రొట్టె ప్రతిదినము దొరకుచుండెడిది. ఆతఁడు దానినిఁ దినుచుఁ గాలయాపనఁ జేయుచుండెను. అతనికి దస్యునిగుఱించినచింతయు భయమును దప్ప మఱియేయుఁ దొందర కలిగించునవి లేకుండెను. దస్యుఁడు వచ్చుచుండునటులఁ దోఁచిన, నాతఁడు భయకంపితుఁ డయి "నన్ను వాఁడు చంపిన నాపాపము పరిహారము కానేరదు." అని భావించెడివాఁడు. ఈతీరునఁ బదిసంవత్సరములు గడచెను. రేగుచెట్టు ఒకటి పెరుగుచుండెను; కాని మిగిలినరెండుదగ్ధకాష్ఠము లేమియు మాఱుపుఁ జెందక యటులనె యుండెను.

ఒకదిన మొదయమున లేచి ధర్మపుత్రుఁడు దగ్ధకాష్ఠములఁ దడిపి యలసి యచటఁ గూర్చుండి శ్రమఁ దీర్చుకొనుచు "నేను పాపము చేసినాను; మరణమునకయి భీతిఁ జెందుచున్నాను. భగవంతునియిచ్ఛ యయినయెడల, బ్రదికియున్నను లేక మృతిఁ జెందినను బాపమునకుఁ బ్రాయశ్చిత్తము నొందఁగలను." అని నిశ్చయించుకొనెను. ఈతలంపు మనమ్మునకు వచ్చియు రాకపూర్వమె, దస్యుఁడు దూషణతిరస్కారములతో నాతనిసమీపమునకు వచ్చెను. ఈశ్వరుఁడు తప్ప మఱెవరు నన్ను రక్షింపను లేరు శిక్షింపను లేరు" అని ధర్మపుత్రుఁడు దృఢపఱచుకొని నిర్భయముగ దస్యుని నెదుర్కొనెను. దస్యుఁ డొంటరిగ రాలేదు. వానివెంటఁ జెఱపెట్టఁబడినయొకబాలుఁ డుండెను. దస్యుఁడు బాలునినోరుఁ గట్టి తిట్టుచుండెను. ధర్మపుత్రుఁడు గుఱ్ఱమెదుట నిలువఁబడి "ఆబాలుని నెచటికిఁ దీసుకొని పోవుచున్నావు?" అని యడిగెను. "వీఁడు వర్తకునిపుత్రుఁడు. వీని నడవిలోనికిఁ దీసుకొనిపోవుచున్నాను. తనతండ్రి ధన మెచ్చట దాచెనో చెప్పువఱకు వీనిని దండించెదను." అని దస్యుఁడు చెప్పి పోఁజూచుచుండ, ధర్మపుత్రుఁడు వాని నాటంకపఱచి గుఱ్ఱపుకళ్లెమును జేతఁ బట్టుకొని "బాలుని విడిచి పెట్టుము" అని యాజ్ఞాపించెను.

దస్యుఁడు క్రుద్ధుఁడయి ఖడ్గముఁ బైకెత్తి "వీనిగతి నీకుఁ బట్టును. అది కోర దవా యేమి? మరల నామార్గమున కడ్డువచ్చిన నిన్ను నఱికివేసెదను. తెలిసినదా? విడిచిపెట్టుము" అని కేకలువేయ ధర్మపుత్త్రుఁడు "నేను విడువను. నేను నీకు వెఱవను. నేను భగవంతునకు మాత్రమె భయపడెదను. నిన్ను విడువఁగూడ దని ఈశ్వరుఁడు నాకుఁ జెప్పుచున్నాఁడు. ఆబాలునిబంధముల భేదింపుము." అని పలికెను.

దస్యుఁడు భ్రికుటితవదనుఁడయి యొరనుండి కత్తిని బయటికిఁ దీసి బాలునిబంధములఁ గోసి "మీరిద్ద ఱావలకుఁ బొండు. నాకుఁ దిరిగి కాన్పింపకుఁడు" అని చెప్పెను.

వర్తకునికుమారుఁడు వెంటనె యూర్ధ్వశ్వాసముతో వనములోనికిఁ బరుగిడెను. పోవుచున్నదస్యుని నాపి, ధర్మపుత్త్రుఁడు వానిని పాపజీవనమునుండి పరివర్తనము నొందు మని ప్రార్థింప, వాఁడు ధీరభావముతోఁ జెప్పినదియంతయు విని మాఱు వచింపక పాఱిపోయెను. మఱుసటిదినము ప్రాతఃకాలము ధర్మపుత్త్రుఁడు దగ్ధకాష్ఠములఁ దడుపుటకుఁ బోయి మఱియొకమోఁడు చిగిర్చి రేగుచెట్టుగ మాఱుటను జూచెను.

## XII

ఇంకొకపదిసంవత్సరములు గడచెను. ధర్మపుత్త్రుఁడు జీవించి యుండెను. అతని కేవాంఛయు భయమును లేక యాతనిహృదయము సదా పరమానందభరితమయి యొప్పెను. "పరమేశ్వరుఁడు మానవుల కెంత సుఖ మనుగ్రహించెను! వారసమసౌఖ్యమున జీవిత మంతయుఁ గడపుట కవకాశము గలదు. కాని వారు భ్రమలఁ దగుల్కొని తమకుఁ దామె కష్టములఁ దెచ్చుకొనెదరు." అని యాతనికి దృఢవిశ్వాసము కుదిరెను. మానవసంఘము నెడల దయార్ద్రహృదయుఁడయి "ఏకాంతముగ నిటుల జీవితము గడపుట యన్యాయము గాన, నేను మానవులవద్దకుఁ బోయి నాజ్ఞానము వారి కుపయోగపఱచెదను." అని యాతఁడు తీర్మానించుకొనెను.

ఇట్లు తలంచినతోడనె, అతఁడు దస్యునియాగమనశబ్దము వినెను. "అదిగో, పోవుచున్నాఁడు. పోనిమ్ము. వాని కేమి చెప్పినను లాభము లేదు. కారణము తెలిపినను గ్రహింపఁడు." అని మొదట తలంచెను. కాని పరక్షణమున నె యాభావము మాఱుటచే, అతఁడు మార్గమున కడ్డముగ నిలిచెను. దస్యుఁడు విషణ్ణవదనముతో గుఱ్ఱముమీఁద నెక్కి క్రిందఁ జూచుచు వచ్చుచుండెను. ధర్మపుత్త్రుఁడు సదయహృదయుఁడయి పరుగునఁ బోయి దస్యునిమోకాళ్లు గట్టిగఁ బట్టుకొని "సోదరా! ఇంకను నీయాత్మను దుర్గతిపాలు చేయకుము. నీయం దట్టియీశ్వరాంశ మున్నది! కాని యొందఱను గష్టపెట్టుచు నీవును గష్టపడుచున్నావు! పరమేశ్వరుఁడు నిన్నెంత మంచివానిగను, నెంత సుఖ మనుభవింపఁగలవానిగను సృజించెను! సోదరా! నీవు సర్వనాశనము చేసికొనకుము. ఇప్పటి కయినను జీవితమును జక్కఁబఱచుకొనుము." అని బతిమాలుకొనెను.

దస్యుఁడు కోపముతో ముఖముఁ ద్రిప్పుకొని "నన్ను విడిచిపెట్టుము. పోయెదను" అని చెప్పగా, ధర్మపుత్త్రుఁడు వానిరెండుకాళ్లను గట్టిగఁ బట్టుకొని యేడ్వసాగెను. దస్యుఁడు ముఖమెత్తి యాతనిముఖమును జూచి గుఱ్ఱము దిగి యాతని సమ్ముఖమున మోకారించి "వృద్ధుఁడా, నేను నీచే జయింపఁబడితిని. నేటి కిరువదిసంవత్సరములనుండి నేను నీతో యుద్ధము చేయుచున్నాను. నేఁడు నీవు నన్ను సంపూర్ణముగ వశముజేసికొనినావు. నామీఁద నా కిఁక నేమాత్రి మధికారము లేదు. నాద్వారా యేమి చేయించుకొనెదవో చేయించుకొనుము. నీవు నాతో మొదటిపర్యాయము మాటాడినతరువాత, నాకోప మధికమయినది. దుష్కర్మ లనేకము జేసితిని. నీ వెప్పు డజ్ఞాతవాసము సలుపుటకుఁ బోవుచుంటివో, యెప్పుడు నీవు మానవులనుండి పొందునది యేదియు లేదని నేను గ్రహించితినో, అప్పటినుండి నీసంగతి నన్నుఁ గలవరపెట్ట నారంభించెను. ఆదినమునుండి నీకొఱకు నేను చెట్టుమీఁద సంచిలో నాహారము పెట్టుచువచ్చితిని" అని చెప్పెను. ధర్మపుత్త్రిన కాసమయమున స్త్రీ మేజాబల్లను దుడుచుటకుఁ బడినశ్రమ జ్ఞప్తివచ్చి యిట్లు తలంచెను. "తువాలను బాగుగ దులిపి తుడిచినప్పుడు బల్ల శుభ్రమయ్యెను. ఎప్పుడు నేను స్వచింతను విడనాడి చిత్తము నిర్మలము జేసికొంటినో, అప్పుడు నేను పరునిచిత్తము నిర్మలము చేయుటకు సమర్థుఁడ నైతిని."

"నీవు మృత్యువునకు వెఱవకుండుటను గనినప్పుడు, నాహృదయములో గూలుపు కలిగినది." అని దన్యుడు నుడువగా, పట్టాను వంపుటకు కృపకులు బడినకష్టము జ్ఞాపకమునకు వచ్చి ధర్మపుత్రుడు "వాని దూల్పను స్థిరపఱుపనంతవఱకు, పట్టాను వంచుట దుస్సాధ్య మయి యుండెను. భయము వీడి నేను ఈశ్వరునియందు జీవనము దృఢముగఁ బ్రతిష్ఠింపఁగనె, నావిశ్వాసము నిశ్చలము కాఁగానె, స్వేచ్ఛాచారి యగు నీశ్వరద్రోహిని వశపఱచుకొన సమర్థుఁడ నయితిని" అని నిశ్చయించెను.

"నీవు నాయెడల దయార్ద్రుఁడ వయి నాకొఱకుఁ గన్నీటిని గార్చుచు నేడ్వ సాగినప్పుడు, నాకఠినహృదయము పూర్ణముగ ద్రవీభూతమయినది." అని దన్యుడు విన్నవింప, ధర్మపుత్రుఁడు విని యానందపరిపూర్ణుఁ డయి దగ్ధకాష్ఠములవద్దకు దన్యుని చెయ్యి పట్టుకొని తీసికొనిపోయి మిగిలియున్న మూడవమోడు చిగిర్చి లేగుచెట్టుగ మాఱుటను గని యిట్లని భావించెను. "ప్రబలాగ్ని ప్రజ్వరిల్లినప్పుడు గొల్లవాండ్రు వచ్చికట్టెలను సహితము మండింపఁగలిగిరి. నాహృదయమున నీశ్వరప్రేమ ప్రజ్వరిల్లి నప్పుడు నేను తాలిగుండెను గఱగింపఁగలిగితిని"

ఎన్నిదినములకుఁ దనపాపమునకుఁ బ్రాయశ్చిత్త మయినది తలపోసి యాతఁ డానందపారవశ్యుఁ డయ్యెను. అతఁడు తనజీవితవృత్తాంతము దన్యునకు వివరముగఁ జెప్పెను. అతఁడు కొంతకాలము ధర్మము బోధించుచు జీవితశేషము గడపి యిహలోక యాత్ర ముగించెను. దన్యుఁ డాతని సమాధిస్థితునిఁ జేసి సదా యాతనియెడ కృతజ్ఞుఁ డయి యాతనియుపదేశానుసారము తనజీవితము ధర్మప్రచారమునందుఁ గడపెను.

సమాప్తము

# మూడవ ప్రకరణము.

## బ్రాహ్మమతము.

చాలకాలమునుండి మనజాతీయమతముగ నుండినహిందూమతమును ప్రస్తుతపుదేశ
కాలజ్ఞానవేషభాషాదులస్థితిగతులనుబట్టి సంస్కరింపఁ బ్రయత్నించుచున్న బ్రాహ్మ
సమాజమతమునుగుఱించి విచారింతము. తక్కినమతములయందువలెనే హిందూమతమున
గూడ రెండులక్షణములు గలవు. అవి సర్వసామాన్యసిద్ధాంతములు, జాతీయసిద్ధాంత
ములు. అందు మొదటివి, సర్వమతసామాన్యము లైనసనాతనధర్మములు; రెండవవి,
చాలకాలముక్రిందటిస్థితిగతులనుబట్టి యేర్పడినజాతీయధర్మములు. ఇవి స్థితిగతులనుబట్టి
మాఱుచుండుటవలన ప్రస్తుతపుస్థితిగతుల ననుసరించి సంస్కరింపఁబడవలయును. కావున
మనజాతీయమతమును సంస్కరింపఁ దలఁచు బ్రాహ్మమతసిద్ధాంతములు హిందూమతమం
దలిసర్వసామాన్యబోధకసిద్ధాంతములై ప్రస్తుతపుస్థితిగతులకుఁ దగినట్టు లుండవలయును.
ఈసందర్భమున మన మింకొకసంగతి జ్ఞాపక ముంచుకొనవలయును. ఏసంస్కరణమతము
నం దైనను ముఖ్యములు, అముఖ్యములు అనురెండువిధము లైనసిద్ధాంతము లుండును.
సర్వసామాన్యముగా నొప్పుకొన్నవి ముఖ్యములుగను, భిన్నాభిప్రాయములు గలవి
అముఖ్యములుగను నెంచఁబడును. ఈచివరవానితో మనకుఁ బని లేదు. కావున బ్రాహ్మ
మతముయొక్కముఖ్యసిద్ధాంతములను విచారింతము. అవి విచారించుటకుపూర్వము
బ్రాహ్మమత మనుపేరునుగుఱించి విచారింపవలసియున్నది. పేరుయొక్కయుద్దేశ
మేమి? ఉపయోగ మేమి? మనచుట్టు నుండుభిన్నపదార్థములను దెలియఁబఱచుట కుప
యోగించుసంజ్ఞయే 'పేరు' అనఁబడును. అట్టిపేరు లేనియెడల నొకరియుద్దేశములు
మఱియొకరికిఁ దెలియఁబఱచుట యసాధ్యము. ఇదియే భాషయొక్కయుద్దేశము.
కావున బ్రాహ్మమత మనుపేరుకూడ మఱియొకదానికంటె భిన్న మైన దని సూచించు
టకు నేర్పడినసాంకేతికము. దేనికంటె భిన్న మైన దనఁగా, హిందూమతముకంటె
భిన్న మైనది. అట్లైన హిందూమతము కాదా యని యడిగిన, అవు నని యే చెప్పవలసి

యున్నది. ఈవిరుద్ధమును సాధించుట సులభము. బ్రాహ్మమతము హిందూమత సిద్ధాంతములనే బోధించుచున్నను, జనసామాన్యమునకు హిందూమతసిద్ధాంతములగురించి గలయభిప్రాయముకన్న భిన్నమైనందున జేయుజాముంబును బొందె. ఇంక బ్రాహ్మమత మనునేపే రెందుకుఁ గలిగె ననిన దానిచరిత్ర తెలిసికొనవలయును.

ఆదికాలమునఁ బ్రపంచమంతటిజిజ్ఞాసువులు వివిధదేశములవివిధజాతీయమతము లకు కారకు లయినపిదప, నాజాతీయమతములును పలుమఱు సంస్కరణములను గోరుచు వచ్చెను. హిందూజాతీయమతమునందును వేదములకాలములనుండియు సంస్కర్త లప్పు డప్పుడు బయలుదేరి యాయాస్థితిగతులకుఁ దగినట్లు నూతనముగాఁ గనఁబడుసిద్ధాంతము లను బోధించుచువచ్చిరి. గౌతమబుద్ధుఁడు, నానకు, కబీరు, తుకారామ్, చైతన్యాదులు ను, శంకర, రామానుజ, మధ్వాచార్యాదులును హిందూమతమును సంస్కరించుచువచ్చు చుండిరి,

ఇటీవల 1830 వ సంవత్సరమున బంగాళాదేశమున రామమోహనుఁ డనుఋషి సంప్రదాయకుఁడు సకలమతసారములను గ్రహించి, హిందూమతపవిత్రగ్రంథములను పరిశోధించి, దేశమున వ్యాపించినదుర్మతమును 'సంస్కరింపఁ దలఁచి హిందూమతమున కాధారము లగుపస్థానత్రయమునకు వ్యాఖ్యానం బొనరించి, జనసామాన్యాదరణీయం బగుదుర్మతమునకు భిన్నముగాఁ గనఁబడునూతనమతమును బోధించి దానిని సర్వమానవ సామాన్యముగాఁ జేయఁ దలఁచి, దానికి సర్వాశ్రయం బగుభగవంతునిమతం బని నామం బిడ నూహించి, హిందూజాతీయమతపవిత్రగ్రంథము లయిన యుపనిషత్తుల యందు భగవంతుఁడు 'బ్రహ్మము' అనుపేరిట వాడంబడుటచే నద్దానికి బ్రాహ్మమతం బని సార్థకనామం బిచ్చె. కావున బ్రాహ్మమత మని చెప్పుటచేతనే దానియందు ముఖ్యముగ నుండవలసినరెండంగములు గల వని తెలియనచ్చును, సర్వమానవకోటి కాధా రభూతుఁడై యొక్కఁడై యుండినభగవంతునిమత మనుటవలన నొక్కదేశమునకుఁ గాని యొక్కతెగవారికిఁ గాని పనికివచ్చునది మాత్రమే గాక సర్వసామాన్యబోధకసనాతన సిద్ధాంతములను గలిగియున్న దని తెలియవచ్చును. హిందూజాతీయమతపవిత్రగ్రంథముల నుండియే పేరును గైకొన్నందున హిందూజాతీయమత మని కూడ తెలియవచ్చుచున్నది. (It is at once Universal and National). అంతియ గాని యిది

విజాతీయమత మనుట వెఱ్ఱితనము. రామకృష్ణపరమహంస నొకసారి యాతనిశిష్యులు బ్రాహ్మమతమునకును హిందూమతమునకును గలభేద మేమని యడిగినప్పు డాపరమ హంస బ్రాహ్మమతము హిందూమత మను వండ్లగింజలోనిబియ్యపుగింజ యని నుడివెను. సహోదరి నివేదిత యనునామె "బ్రాహ్మసమాజము హిందూపూర్వాచారపరాయణ సంఘమునుండి వెలియి యాసంఘమునకే కావలసినకొన్నిమార్పులను జేసి చూపుటకుఁగా నేర్పడినసంఘ" మని చెప్పినది. పండితమోక్షమూలరుగా రొకసారి బ్రాహ్మసమాజ మతము వలననే హిందూమతమం దాధ్యాత్మికతత్త్వోద్ధరణము కాఁగల దని నుడివిరి. దేవేంద్రనాథటాగూరుప్రణీతం బైన "బ్రాహ్మధర్మ" మనుశ్రుతిస్మృతిసారసంగ్రహ మును వీక్షించినయెడల బ్రాహ్మమతసిద్ధాంతములు హిందూజాతీయమతసిద్ధాంతము లని తేటపడక మానదు. వేయేల, సంస్కృతభాషాపాండిత్యమునందును, హిందూమతతత్త్వ శాస్త్రజ్ఞానమునందును, ఇఁక మతసంబంధమైనమఱియేవిషయమునందును సమానులు లేరని చెప్పఁదగు పండితరామకృష్ణగోపాలభండార్కరు, పండిత సీతానాథతత్త్వభూషణుఁడు లోనగుప్రముఖు లెందఱో బ్రాహ్మమత మనుపేరిట సంస్కరణములను గావిం చుట చూడఁగా నిది విజాతీయమత మని చెప్పఁ గడఁగుట కడుసాహసము. బ్రాహ్మ మతసిద్ధాంతములు పెక్కు లున్నను బ్రాహ్మధర్మమంతయు బ్రాహ్మధర్మబీజ మనంబడు నాలుగువాక్యములలో నిమిడియున్నది.

1 బ్రహ్మవా ఏక మిద మగ్ర ఆసీన్నాన్య త్కించనాసీ త్తదిదంసర్వ మసృ జత్.

2 తదేవ నిత్యం జ్ఞాన మనంతం శివం స్వతంత్రం నిరవయవ మేక మేవాద్వితీ యమ్ సర్వవ్యాపి సర్వనియంతృ సర్వాశ్రయం సర్వవిత్ సర్వశక్తిమత్ ధ్రువం పూర్ణ మప్రతిమం.

3 ఏకస్య తస్యైవోపాసనయాపారత్రిక మైహికంచ శుభం భవతి.

4 తస్మిన్ప్రీతి స్తస్యప్రియకార్యసాధనంచ తదుపాసన మేవ.

1 బ్రహ్మ మొక్కటే యాదియం దుండెను గాని వేఱొదియు లేదు. అద్దియే యీయన్నిటిని సృజించెను.

2 ఆది నిత్యము, జ్ఞానస్వరూపము, అంతము లేనిది, మంగళస్వరూపము, స్వతంత్రము గలది, అవయవము లేనిది, రెండు గాక యొక్కటైనది, సర్వవ్యాపి, సర్వనియన్త, అన్నిటి కాశ్రయ మైనది, సర్వజ్ఞతయుఁ సర్వశక్తియు గలది, ధ్రువ మైనది, పూర్ణము, సమానము లేనిది.

3 దాని నొకటి నుపాసించుటచేతనే ఐహికాముష్మికశుభములు గలుగుచున్నవి.

4 ఆబ్రహ్మమునెడలఁ బ్రీతియు, దానికిఁ బ్రియమైనకార్యములను జేయుటయు దానిని బ్రార్థించుటయే యగును.

# నా ల్గ వ ప్రి క ర ణ ము.

## బ్రాహ్మమతసిద్ధాంతములు.

ప్రతిమతమునందును గొన్ని సామాన్యవిషయములు గలవు. ఆయావిషయములను గురించినవివిధభేదములే వివిధమతములకుఁ గారణములు. అట్టివిషయములనుగురించిన బ్రాహ్మమతసిద్ధాంతము లీక్రిందఁ దెలుపఁబడును.

### భ గ వ ం తుఁ డు.

భగవంతుఁ డీప్రపంచమున కాదికారణుఁడు. అతఁడు ఆత్మస్వరూపి; స్థూల పదార్థము గాదు. అతఁడు సర్వవ్యాపి; సర్వశక్తుఁడు; సర్వజ్ఞుఁడు; సర్వభూతదయాళుఁడు; ఆనందస్వరూపుఁడు; పరమపావనుఁడు; అతఁడు మనకు తండ్రియు, తల్లియు, పోషణకర్తయు, గురువును, రాజును, రక్షకుఁడును, అయి యున్నాఁడు. అతఁడు అద్వితీయుఁ డగునొక్కఁడే.

### జీ వా త్మ.

ఆత్మ శాశ్వత మయినది. మరణ మనఁగా భౌతికశరీరవిసర్జనము. ఆత్మ యెల్లప్పుడును పరమాత్మ యగుభగవంతునియందే వసించుచుండును. రాఁబోవుజన్మము ప్రస్తుతపుజన్మముయొక్కయుత్తరభాగమును, అభివృద్ధియు నై యున్నది. జీవాత్మ యీప్రపంచమును వదలినప్పుడు పుణ్యపాపములు వెంట రాఁగా వానిఫలముల ననుభవించుచు నిరంతరాభివృద్ధిమార్గమునఁ జనుచుండును.

### పవిత్రగ్రంథములు.

భగవంతునిచే లిఖిత మైనసత్యపవిత్రగ్రంథములు మూఁడు. అవి (1) సృష్టిస్వభావము (2) మానవబుద్ధియందు నాటఁబడినస్వాభావికభావనలు (3) ఈభావనలే భగవంతునినిబంధనల ననుసరించి మానవచరిత్రనుండి పరిణామము నొందినయవస్థలు. (1)సృష్టికర్తయొక్కజ్ఞానము, శక్తి, అనురాగము, ఈసృష్టిగ్రంథమునందు స్పష్టముకాఁ గలవు. ఆతనిసృష్టిని శ్రద్ధతోఁ బరిశీలించినకొలఁది నాతని దెలిసికొన్నవార మగుదుము

(2) భగవంతునిగురించియు ఆత్మయొక్క నిత్యత్వమునుగురించియు నీతినిగురించియు గలముఖ్యసిద్ధాంతబీజములు మానవప్రకృతియందే స్వతస్సిద్ధముగా నేర్పాటుకాఁబడియున్నవి. (3) అట్టిస్వాభావికసిద్ధాంతములు మానవచరిత్రయందు కొందఱిమనస్సుల మూలకమున నేదోయొకరూపమును గైకొని యుతగులయుద్దేశములకుఁగాని కార్యములకుఁగాని ప్రేరణకారణము లగును. మనుజునికి సహజజ్ఞానము కల దనియు మానవచరిత్రయందాజ్ఞాన మభివృద్ధి నొందుచుండు ననియు బ్రాహ్మమతముయొక్క మూలసిద్ధాంతము.

## ఉపాసన.

నిజమైనయుపాసన ఆత్మసంబంధ మయినది. దానికి బాహ్యాడంబరము పనిలేదు. అట్టియుపాసనకుఁ గావలసినవి ప్రేమ, భక్తి, నమ్రత, ఇంద్రియనిగ్రహము మాత్రమే. ఉపాసన నాలుగుఅంగములు గలది. (1) స్తోత్రము (2) ధ్యానము (3) వందనము (4) ప్రార్థన. (1) భగవంతునిపరిపూర్ణత్వపావనత్వాదిగుణములను దలఁచి మనభక్తిశ్రద్ధల దెలుపుట స్తోత్రము. (2) సృష్టియందును మనయాత్మయందును భగవంతుని సర్వవ్యాపకత్వమును జింతించి ఆతనిని బొంద ననుకరించుట ధ్యానము. (3) భగవంతుని సర్వకారుణ్యత్వమును జింతించి ఆతనియెడల మనకుఁ గలకృతజ్ఞతను బయలుపెట్టుట వందనము. (4) పాపబంధములనుండి తొలగుటకై ఆత్మపారిశుధ్యమును, సాహాయ్యమును మనకు ప్రసాదింపు మని వినయముతో వేఁడుకొనుట ప్రార్థన. ప్రతిదినము నిట్టియుపాసన నభ్యసించుచువచ్చినచో మనము భగవంతునితో నెడఁతెగనిసంబంధము కలవార మగుదుము.

## అవతారములు.

భగవంతుఁ డెన్నఁడును భౌతికమైనమానవశరీరమును ధరించి మానవునిభంగి నుండఁడు. ఆతనిదేవత్వము ప్రతివానియందును గలదు. అట్టిది అవతారము లనఁబడువారియం దెక్కువస్పష్టముగాఁ గనఁబడును. వారు కొన్నివేళలయం దుద్భవించి యితరజనుల యొక్కఆత్మశక్తుల నుద్రేకింపఁజేసి వారికి బోధన లొనర్చి మతప్రపంచమునకుఁ గడు మేలొనఁగూర్తురు. కావున వారు సర్వజనులయొక్కకృతజ్ఞతకును భక్తికిని పాత్రులు. అయినను వారు నిష్కళంకు లని కాని అమోఘు లని కాని చెప్ప వీలు లేదు.

## మోక్షసాధనము.

అకృత్రిమ మైనట్టియు మనఃపూర్వక మైనట్టియు నుపాసనయే మోక్షసాధనము. ఉపాసన అకృత్రిమముగను మనఃపూర్వకముగను నుండుటకు పెక్కుసాధనములు గలవు. అవి సత్సాంగత్యము, సద్గ్రంథపఠనము, సృష్టిమహిమానుచింతనము, ఏకాంతభగవద్ధ్యానము, ఆత్మదృఢపరిశోధన, విజితగర్వకామత్వము, పాపపరిహారపశ్చాత్తాపము, సకలజనసుఖాభివృద్ధిసాధనైకాత్యభినివేశయుక్తమనఃపూర్వకపరిశ్రమము. ఈమార్గముల ననుసరించి మనుజుఁడు చేయుకృషియు,భగవదనుగ్రహమును గలసి మోక్షము నందఁజేయును.

## ఇతరమతములకుఁ గలసంబంధము.

బ్రాహ్మమత మితరమతములకన్న భిన్న మైనది. అయినను అన్నిటియొక్కయు సారమే. అది యితరమతములకు విరోధి కాదు. వానియందుఁ గలసత్యముల నది గ్రహించుచున్నది. అసత్యములనుమాత్రమే నిరాకరించుచున్నది. అది భగవంతునిచే నిర్మింపఁబడి అతనినిబంధనల ననుసరించి వికాసము జెందుమానవప్రకృతిమీఁద నాధారపడియున్నందున, దైవికమును, పురాతనమును, సనాతనమును, సర్వసామాన్యమును అయియున్నది. అది యొకతెగ కాదు. ఒకకాలమునకుఁ గాని యొకదేశమునకుఁ గాని సంబంధించినది గాదు. ఈమతసందేశము ననుసరించునన్ని దేశములవారును అన్ని తెగలవారును బ్రాహ్మ లనఁబడుదురు.

## కులములు, జాతులు.

మానవు లందఱు నొక్కటేజాతికిఁ జెందినవారు. వారు బ్రాహ్మమత మనుసరించుటకు సమానార్హత గలవారు. మతమునందు బ్రాహ్మణు లని కాని, శూద్రు లని కాని, హిందువు లని కాని, యవను లని కాని, ధనికు లని కాని, దరిద్రు లని కాని, గొప్పవా రని కాని, కొద్దివా రని కాని, భేదము లేదు. భగవంతుఁడు జాతుల ననుసరించియు, ప్రాపంచికస్థితిగతుల ననుసరించియు, ఎట్టివారిని అనుగ్రహించుటయు నిరాకరించుటయు లేదు. సద్భక్తులను, సన్మార్గవర్తనులను అతఁడు అనుగ్రహించుచున్నాడు. బ్రాహ్మమతము భిన్నజాతులకుఁ గలపరస్పరద్వేషబుద్ధిని, మాత్సర్యమును, స్థితిగతులనుబట్టి యేర్పడినగర్వమును, రూపుమాపి సర్వమానవసముదాయమును వనుదైకకుటుంబముగ మార్చుపరమావధిని గలిగియున్నది.

## ధర్మములు

ధర్మములు నాలుగువిధములు. 1 భగవంతునియెడల ధర్మములు—అద్వితీయుండును, సత్యస్వరూపుఁడు నైనయాతనియందు నమ్మిక, ప్రేమ, ఉపాసన. 2 తనయెడల ధర్మములు—తనశరీరము నారోగ్యదశయం దుంచుకొనుట, జ్ఞానమును, నిర్మలత్వమును, ఆత్మపారిశుద్ధ్యమును సంపాదించుకొనుట 3 ఇతరులయెడలధర్మములు—సత్యవాదిత్వము, వాగ్దాననిర్వాహకత్వము, న్యాయము, కృతజ్ఞత, తల్లిదండ్రులయెడలను, అన్నదమ్ముల యెడలను, అక్కచెల్లెండ్రయెడలను, పిల్లలయెడలను, బంధువులాదిగాఁ గలవారియెడలను ప్రేమ, సర్వమానవశ్రేయోభివృద్ధిప్రయత్నము. 4 హీనజంతువులయెడలధర్మములు—పక్షులు, మృగములు లోనగుజీవజంతువులయెడల కనికరము.

## పాపపరిహారము.

పాపము చేసినప్రతివాఁడును ఎప్పటి కైన నీలోకమునఁ గాని పరలోకమునఁ గాని తనపాపకర్మఫల మనుభవింపవలసిన దే. ఏల యన, నీతివిధి స్థిర మయినది. భగవంతునిన్యాయవిధి తిప్పఁగూడనిది. ఆతనికరుణాశీలత వృథా గావలసినదిగాదు. నిశ్చలన్యాయశీలుఁడు దయామయుఁడు నగుతండ్రివలెనే దుర్మార్గమును బోఁగొట్టి సన్మార్గమునకుఁ దెచ్చుటకు భగవంతుఁడు మనుజునికి తగినబాధలను గల్పించుచున్నాఁడు. పాపి యిట్టిదండనలచేత పశ్చాత్తప్తుఁడై వినయముతో ప్రార్థించునప్పుడు భగవంతుఁడు వానిని పాపబంధములనుండి విముక్తునిఁజేసి తనతోఁ గలసియుండుభాగ్యమును సమకూర్చును.

## మోక్షము.

మానవుఁడు అజ్ఞానమునుండియు పాపబంధములనుండియు విడుదల యయి పావనత్వమునందే సంతతాభివృద్ధి నొందుచువచ్చుటయే మోక్ష మనఁబడును. అట్టియభివృద్ధి శాశ్వతముగా నెడతెగక యుండుటవలన మానవుఁ డంతకంతకు దేవత్వము నొందుచు అనంతమైనజ్ఞానమునకు, పావనత్వమునకు, ఆనందమునకు, నిలయుఁడైనభగవంతునియందు సౌఖ్యము నందుచుండును. భగవంతునితోడియట్టిసాంగత్యమే మోక్షము.

## కేశవచంద్రసేనునిచరిత్రము.

దేవేంద్రనాథుఁడు 1858 వ సంవత్సరమున సిమ్లాపర్వతమునుండి మరలివచ్చెను. అతఁడు లేనికాలమున కలకత్తాపురమునఁ దా నెఱిఁగినట్టియు మిక్కిలి పేరుపోసినట్టియు కుటుంబమునకుఁ జెందినవాఁడును, ప్రతిభావంతుఁడును, శక్తివంతుఁడు నగునొక యౌవనుఁడు సమాజమునఁ జేరియుండుట జూచి యమితానందము నొందెను. ఈతఁడే పియారీమోహనసేనునికుమారుఁ డగు కేశవచంద్రసేనుఁడు. పియారీమోహనసేను హిందూశిలాశాలయందు దేవేంద్రనాథునియొక్క సహాధ్యాయుఁడు. కేశవచంద్రసేనున కప్పటి కిరువదిసంవత్సరములప్రాయ ముండెను. ఆతఁడు 1838 వ సంవత్సరమున జన్మించెను. కేశవచంద్రసేనునికుటుంబమువారు వైష్ణవమతస్థులు. కేశవచంద్రసేనునితండ్రి తాత యగు రామకమలసేనునివలె విఖ్యాతి జెందినవాఁడు గాకపోయినను మిక్కిలిభక్తిపరుఁడును పూర్వాచారపరాయణుఁడు నై యుండెను. కేశవచంద్రసేనునితల్లి దాతృత్వమునకును భక్తికిని ప్రసిద్ధిజెందియుండెను. ఆమె తనకుమారుఁడు చేసినసంస్కారముల నెల్ల నామోదించి యాతనిపక్షమందే యుండెను. భక్తిపరాయణు లగువారికుటుంబమున జన్మించుటవలనను, పూతచారిత్రు లగుజననీజనకులచేఁ బెంపఁబడుటచేతను కేశవచంద్రుఁడు బాల్యమునుండియు మతావేశమునకు లోనై యుండెను. బాల్యమునుండియు నాతఁడు దుర్మార్గులస్నేహము చేయకుండునట్లు శ్రద్ధగైకొనఁబడుటచే చక్కనిసుగుణసంపద గలిగి యాధ్యాత్మికోద్దేశములతో నొప్పుచుండెను. ఆతఁడు తన బాల్యమును వేడుకలతోను, పాటలతోను, క్రొత్తక్రొత్తవినోదములఁ గల్పించుటతోను, చిత్రవిచిత్రములను జూపులాంతరును ప్రదర్శించుటతోను, నాటకశాలల నెలకొలుపుటతోను గడపుచుండెను. ఆతఁడు బాల్యమునందే యితరులను ప్రేరేపించి వారిని తనస్వాధీనమునం దుంచుకొనునట్టిస్వభావమును గలిగియుండెను. తనతోడివారలకు నీతులఁ గఱపుట కుత్సాహపడుచుండెను. పెద్దవారితోఁ గలసి "ఆంగ్లేయహైందవసంఘము" మను పేర నొకసంఘము నేర్పఱిచెను. ఈయుద్యమమునం దాతనిజ్యేష్ఠభ్రాత యగు నవీనచంద్రసేనుఁడు మిగుల ప్రోత్సాహపరచుచుండెను.

1855 వ సంవత్సరమునం దాతనిగృహమునం దాసంఘముయొక్క యాదరణమున నొకసాయంకాలపాఠశాల స్థాపింపఁబడెను. అందు చిన్నవాండ్రను జేరఁదీసి వారి కనుదినము పాఠములఁ జెప్పుచుఁ దన్మూలమున నీతుల నేర్పుచుండవచ్చు నని యాతఁ డూహించెను. ఇట్లుండ దురదృష్టవశమున నొకవిచారకర మైనసంగతి జరగెను. 1856 వ సంవత్సరమునం దాతఁడు సీనియరుస్కాలరుషిప్పుపరీక్షకుఁ బోయినప్పు డొకదినమున పరీక్ష జరుగుచున్నసమయమున నాతఁడు తనసమీపమునం దున్నమతియొకబాలునితో మాటలాడుచున్నట్లు కనుఁగొనఁబడెను. తోడనే వారిరువురును పరీక్షనుండి యావలికిఁ బంపివేయఁబడిరి. ఈవిచారకర మైనసంగతి యాతనిజీవితమునందు గొప్పమార్పును గలుగఁ జేసెను. ఈస్వల్పాంశమే యాతఁడు దృఢమైన యాత్మపరిశోధన జేసికొనుటకును, దన ప్రవర్తనను దిద్దుకొని జీవితమును పవిత్రమార్గమునఁ ద్రిప్పుకొనుటకును గారణ మయ్యెను. దీనినిబట్టి చూడ నాతని కెట్టిదృఢనిశ్చయమును ధైర్యమును గలదో చదువరులే గ్రహించుకొనవచ్చును.

## కేశవచంద్రసేనుఁడు బ్రాహ్మసమాజమునఁ జేరుట.

ఆసంవత్సరమునందే అనగా 1856 వ సంవత్సరమున కేశవచంద్రసేనునకు వివాహము జరిగెను. అప్పటి కాతనికి పదునెనిమిదివత్సరములప్రాయ ముండెను. అనంతర మాతఁడు వేదాంతగ్రంథములఁ జదువ నారంభించెను. ఆతనికి నూతనవిషయములపై నమ్మకములు గలుగఁజొచ్చెను. ఆత్మీయజ్ఞానోదయమునకును దానిరక్షణకును ప్రార్థన యత్యంతావశ్యక మని నమ్మెను. తా నొంటరిగ నుండుతరి తనకాలమును ప్రార్థనయందు గడపుచుండెను. తాను ప్రార్థించుటయె గాక యితరులనుగూడ పురికొల్పుచుండెను. 1857 వ సంవత్సరమున నాతఁడు "పరస్పరభ్రాతృభావసమాజము" ను స్థాపించి యందు థియోడరుపార్కరు మున్నగువారి గ్రంథములఁ జదివి నీతివిషయములఁగూర్చి యుపన్యసించుచుండెను. ఆతఁ డిట్లు తననూతనాభినివేశములను పెంపొందించుకొనుచుండిన కాలమందు రాజనారాయణబోసుచే ప్రకటింపఁబడిన "బ్రాహ్మసమాజ మనగేమి" యనునొకకరపత్ర మాతనిచేతఁ జిక్కెను. దానిని జదివి యం దుదాహరింపఁబడిన సిద్ధాంతములకును తనయం దంకురించిననూతనాభినివేశములకును గలసమత్వమును గాంచి యాశ్చర్యము నొంది యాతఁడు తక్షణమే బ్రాహ్మసమాజమునఁ జేరెను.

దేవేంద్రనాథుఁడు పర్వతప్రాంతములనుండి వచ్చినతోడనే కేశవచంద్రు సత్యం ప్రీతితో నాదరించెను. దేవేంద్రనాథునకును నాతనికిని గాఢమైనమైత్రి వాటిల్లుటచే వారిరువురు నేకీభవించి యనేకమైనయద్భుతకార్యములఁ జేయుచుండిరి. ఆకాలమున దేవేంద్రనాథుఁ డావేశముతోఁ జేయుధర్మోపదేశముల వినుట కనేకులు వందలకొలఁది జనులు గుమిగూడుచుండిరి. అతనినోటినుండి వెలువడినప్రతిమాటయు భగవంతుఁడు సమీపమునం దుండినట్లు వినువారికిఁ దోఁపఁజేయుచు వారికి పరవశత్వము గలుగఁజేయుచుండెను. అనేకులు తమపాపములకు పశ్చాత్తాపము నొంది సన్మార్గులు గాఁ జొచ్చిరి. వారిహృదయములందు దేవేంద్రనాథుని వాక్యములు గాఢముగా నాటుకొనుచుండెను. ప్రతివారము సమాజమునఁ జేరుటకు వచ్చువారిసంఖ్య యంతకంత కధికమగుచుండెను. ఇవ్విధముగా బ్రాహ్మసమాజము దినదినప్రవర్ధమాన మగుచుండెను.

1859వ సంవత్సరమున తత్త్వబోధినీసభ చాలింపఁబడి బ్రాహ్మసమాజముయొక్క యధీన మయ్యెను. దానికిఁ జెందినముద్రాయంత్రము పుస్తకభాండాగారము మున్నగునవి బ్రాహ్మసమాజసంరక్షకులస్వాధీనము జేయఁబడెను. తత్త్వబోధినీసభకు కార్యదర్శియయినపండిత ఈశ్వరచంద్రవిద్యాసాగరున కాకొత్తమార్పులయం దిష్టము లేనందున తనకార్యనిర్వాహకత్వము చాలించుకొనెను. ఆతనిస్థానమున దేవేంద్రనాథుఁడును కేశవచంద్రసేనుఁడును కార్యదర్శులుగ నియమింపఁబడిరి.

కేశవచంద్రసేనుఁడు తనప్రియమిత్రుఁ డగు ప్రతాపచంద్రముజుందారుతోడను, పరస్పరభ్రాతృభావసామాజికులతోడను "విధవావివాహనాటకమును ప్రదర్శించెను.

## కేశవచంద్రుఁడు బ్రాహ్మసమాజాభివృద్ధికిఁ బూనుకొనుట.

కేశవచంద్రసేనుఁడు బ్రాహ్మసమాజకార్యనిర్వాహకమునకుఁ బూనుకొని యావత్సరమునందె ఏప్రిలు 24వ తేదీని "బ్రాహ్మపాఠశాల" ను స్థాపించెను. అందు ప్రతివారము బ్రాహ్మమతతత్త్వమును గూర్చి వంగభాషలోను ఆంగ్లేయభాషలోను నుపన్యాసము లీయఁబడుచుండెను. ఈయుపన్యాసము లనేకవిద్యార్థుల నాకర్షించుటచే వారిలో ననేకులు బ్రాహ్మసమాజమునఁ జేరుచుండిరి. భవానీపురమున నీపాఠశాలయొక్క శాఖయొకటి నెలకొల్పఁబడెను. కేశవచంద్రసేనుఁడు తనయుపన్యాసములలో ప్రసిద్ధిచెందిన "మానవజీవితముయొక్క గమ్యస్థానము" అనునుపన్యాస మందుఁ జదివెను.

1859వ వత్సరమున సెప్టెంబరు 27వ తేదీని దేవేంద్రనాథుఁడును నాతనిద్వితీయ పుత్రుఁ డగు సత్యేంద్రనాథుఁడును కేశవచంద్రసేనుఁడును గలిసి సింహళద్వీపమునకు నావికాయాత్ర జేసిరి. ఈప్రయాణము కేశవచంద్రునకును దేవేంద్రనాథునకును గల మైత్రిని తొల్లింటికంటె నధికపరిచెను.

సింహళమునుండి మరలివచ్చినతరువాత నాతనిసంరక్షకులప్రోత్సాహమువలన కేశవచంద్రసేనుఁడు బెంగాలుబ్యాంకునం దొకయుద్యోగమునఁ బ్రవేశించెను. కాని యందు 1861వ సంవత్సరము జూలయిమాసమువఱకే యుండెను. ఆకాలమునందుఁగూడ నాతఁడు తనజీవితోద్యోగమునె సిద్ధపరచుకొనుచుండెను. తఱచు కాళీఘట్టమునకుఁ జని యందలిపుస్తకభాండాగారమునం దమితశ్రద్ధతోఁ జదువుచుండెను. విశ్రాంతిసమయములందు బ్రాహ్మపాఠశాలయందు తా నొసంగునుపన్యాసముల సిద్ధముచేసికొనుచుండెను.

1860వ సంవత్సరారంభమున నాతఁడు నవద్వీపదేశరాజధాని యగు కృష్ణనగరునం దుపన్యాసము లిచ్చుచుండెను. ఇచ్చట రెవరెండు డయాసను మున్నగు క్రైస్తవులాతనితో వాదములు జేసిరి. ఆచర్చలు 1863వ సంవత్సరమువఱకు జరుపఁబడుచుండెను. ఆవత్సరమున "బ్రాహ్మసమాజము నిర్దుష్టమైనది" అను నుపన్యాసము నొసఁగియుండెను. అనంతర మాతఁడు పండ్రెండుకరపత్రముల నొకటివెనుక నొకటి ప్రచురించెను. ఈకరపత్రము లనేకవిద్యార్థుల నాకర్షించుటచే వా రాతని దమనాయకునిగ గ్రహించి బ్రాహ్మసమాజమునఁ జేరుచుండిరి.

ఆకాలమునందు జరిగినముఖ్యవిషయములలో నొకటి సంగతసభాస్థాపనము. ఈసంగతసభలు ముఖ్యముగా కేశవచంద్రునిమందిరమున జరుపఁబడుచుండెను. ఆసభలు యౌవనులందు గలుఁగఁజేసినమార్పులు వర్ణనాతీతములు. వారు సభలయందు నీతిమతవిషయములఁ జర్చించి సారాంశమును గ్రహించుటయే గాక వానిని దమయనుభవమునకుఁ గూడఁ దెచ్చుకొనుచుండిరి. ఆసభలందు వర్ణభేదములువదలివేయుటకును,యజ్ఞోపవీతముల విసర్జించుటకును, విగ్రహారాధనాసంబంధమైన యుట్టిపండుగలకును వచ్చునాహ్వానము నామోదింపకుండుటకును, భోగముమేళములకుఁ బోకుండుటకును, త్రాగుడు నిషేధించుటకును, అన్నిటియందును మితత్వమును గలిగియుండుటకును, తమభార్యలకును అక్కచెల్లెండ్రకును తమకుఁ గలిగినజ్ఞానకాంతులఫలితము కలుఁగఁజేయుటకును, త్రికరణశుద్ధిగా సత్యవాక్యపరిపాలనఁ జేయుటకును, తమసమస్తవ్యాపారములందు న్యాయముగా వర్తించుటకును తీర్మానములు చేసుకొనిరి. సంగతసభలవలన ననేకులు మతప్రచారకులుగ బయలుదేరిరి. ఈసభలవలన బ్రాహ్మసమాజమునకుఁ గలిగిన లాభములనంతములు.

# ప్రేమ

ఈవిశాలవిశ్వ మంతయు మహాద్భుతములతో నిండి నిబిడీకృతమై యున్నది. అట్టియద్భుతమహాసముద్రమధ్యమున మనము జీవించుచు-న్నారము. కాని యీయద్భుతము లన్నిటియందును ప్రేమయొక్క-యావశ్యకత యధిష్ఠానదేవతయై యున్నది. ఈదేవత మానవకోటి యందే గాక జంతుకోటియందుఁ గూడ ప్రభుత్వాధికారమును జేయు-చున్నది. జీవితముయొక్క వ్యవస్థలయం దన్నిటియందు నది మూల విరాట్స్వరూపము. ప్రేమయొక్క యావశ్యకతయే లేనియెడల విశ్వ మం తయు జడపదార్థమయమై, రూపరహితముగఁ జలించుచు నిరర్థకం బగును. భిన్నము లగుస్థితులయం దుండుభావము లనేకములు మానవకోటినిఁ బాలించుచుండును. ఈభావముల నన్నిటిని ప్రేమ నడిపించుచుండును. "మనము ప్రేమింపవలయును. లేదా చనిపోవలయును." అని దేవుఁడు నిర్దేశించియున్నాఁడు. ఈయున్నతవిధిని దెలిసికొనకయుండువారలు గాని, లేక దీనిని నిర్లక్ష్యముగఁ జూచి విపరీతార్థమును జేయువారలు గాని మానవులయం దెల్ల సౌఖ్యవిహీనులు.

దేవుఁడు ప్రేమాస్వరూపుఁడు. ఆతఁడు ప్రేమయొక్క యాద్యంతరహిత మైనశక్తి యగుటచే సృష్టి యంతయు గూడ ప్రేమపూరితముగ నిర్మించియున్నాఁడు. ప్రేమకు పరిమాణ మనునది లేదు. అది యత్యుగ్రమైనశక్తి యై యున్నది. ప్రేమ కసాధ్యము లగునట్టివి గాని, శాస్త్రసమ్మతములు గానట్టివి గాని కార్యము లెవ్వియు లేవు. అందుచే దానికి భార మనునది లేదు; శ్రమ యనునది లేదు; అసాధ్య మనునది లేదు; అది తనశక్తికి మించినపనులను గూడఁ జేయ సమకట్టును. అలసినను విసుగుదల దానికి లేదు. నిర్బంధింపఁబడినను కష్టదశ దానికి లేదు. భయపడినను కలవరము దానికి లేదు. తీవ్రతర మగు జ్వాలవలె నది తనమార్గమునం దాటంకము లగువాని నెల్ల భస్మీపటలము చేయును.

ఇంతవఱకు ప్రేమను నిర్వచించితిమి. ఈప్రేమాతత్వమును గ్రహిం
చునప్పుడు, మలామా చేయఁబడినదగను జూచి స్వచ్ఛ మగు బంగారునగ
యనియు, విద్యుద్దీపమును జూచి యాకాశమునందు వెలుంగునక్షత్ర
మనియు భ్రమించు నటుల మోసపోక దానికిఁ గల గాఢమగునట్టియు
సత్యమగునట్టియు నర్థమును గ్రహింపనగును. స్త్రీపురుషులకుఁ గల
వైవాహికాకర్షణ స్వభావసిద్ధముగ సృష్టియందుఁ బ్రతిపాదింపఁబడినది.
పరస్పరప్రేమాబద్ధులుగఁ జేయుట కది సూదంటుఱాయి. అంతమాత్రము
చేత స్త్రీపురుషులకుఁ గలవైవాహికాకర్షణమాత్రమే ప్రేమ కాదు.
వారియాత్మలు గూడ పరస్పర మాకర్షింపఁబడినఁ గాని ప్రేమ సంపూ
ర్ణము గాదు. ఆత్మాత్మలచే నాకర్షింపఁబడనిదానిని కురూప మగుప్రేమ
యని చెప్పనగును. అట్టియసంపూర్ణప్రేమ మోహమును దీర్చుకొను
టకు మాత్రము జనించినదై యున్నది. ఒకబాలుఁ డేదేని నాటవస్తు
వును జూచి దాని నాశించి యది లభ్య మగుదనుక విలపించును. లభ్య
మైనపిమ్మట దానితోఁ గొంతసే పాడియాడి దూరముగా విసరివైచును.
సృష్టియం దంతటను వైవాహికాకర్షణ సామాన్యమై యున్నది. అది
యుక్తమై సుందరమై ప్రకృతిజన్యమై యుండుటచేత దైవికనియమమై
యున్నది. ప్రకృతిజన్య మగుప్రతినియమము నొక్కొకయాధ్యాత్మికనియ
మముయొక్క దర్పణమై యున్నది. కావున ప్రేమ సంపూర్ణమై యుండఁ
గోరితి మేని వైవాహికాకర్షణతోఁ బాటు ఆత్మాకర్షణ గూడ విధిగా
నుండి తీరవలయును.

ఆంగ్లేయదేశములయందు స్త్రీపురుషులు కొన్నిసారులు మా
త్రము కలసికొనినంతనే పరస్పర మనుకూలముగ నుండెనేని వివాహమును
గావించుకొనెదరు; భారతవర్షమునం దన్ననో వైవాహికసూత్రముల
నైన గ్రహింపఁజాలనిబిడ్డలకే వివాహమును గావించెదరు; ఈరెండుదా
హరణములయందును గూడ ప్రేమ సంపూర్ణమై యుండఁజాలదు.

మొదటిదివివాహ మని యైనఁ బిలుచుటకుఁదగునుగాని రెండవదాని కావె
రెట్లు చెల్లును! అది రాక్షసకృత్యము గాని వివాహము కాదు. ఈ రెండు
విషయములయందును గూడ స్త్రీపురుషులు వారియొక్క యథార్థమైన
స్వభావమును గాని గుణమును గాని పరస్పరము తెలిసికొనియుండలేదు.
అందుచేత వారికి నిజ మగుప్రేమ యెంతమాత్రమును దెలియదు. జీవిత
ములయొక్క గాయకసమూహము నంతను సమతాళమునం దుంచు
నటులఁ గాపాడు నట్టిప్రేమయొక్క గాని, కాలముయొక్క నాళముల
యందు రక్తమయమై ప్రవహించు ప్రేమయొక్క గాని, మాధుర్యమును
వా రావంతయైనఁ జవి చూడఁజాలరు.

భౌతికవిషయములయందే యెక్కువగ లక్ష్యము ప్రబలుచున్న
యీకాలమునందు 'ప్రేమ' యనుపదము నచింతితముగను నజాగ్రతగను
వాడుచున్నారు. ఈశ్వరప్రసాదిత మగునుత్కృష్ట మైనవరమును
వ్యర్థపదార్థముగ నుపయోగించుచున్నారు. అభిరుచులయొక్కయు,
నభిప్రాయముల యొక్కయు, నభిలాషలయొక్కయు సంపూర్ణసామ్య
మును గలిగినజీవితద్వయము నైక్యము చేయుటయే వివాహము. దీనికి
విరుద్ధముగ ప్రాపంచికసుఖము నపేక్షించియో, లేక రక్తసంబంధము
కలియుటకొఱకో, వైవాహికము జరుపఁబడుచున్నది. మఱికొన్నిస్థల
ములయందు తలిదండ్రులు ద్రవ్యముకొఱకాసించి తమబిడ్డలను దానికి
బలివేసి, మంచిసంబంధములను గుదిర్చితి మని మురియుచున్నారు. ఈ
యాచారము మనదేశమునందే గాక పాశ్చాత్యదేశములయందుఁ గూడ
కొంతవఱకు గలదు. ఇట్టివివాహములయందు పౌరోహితులు తమయం
దేమాత్రమును లోపము నుంచుకొనక వధూవరులను సంపూర్ణముగ
దీవించెదరు. కాని పాపము వారిజీవితములు పరస్పరము విపత్తులతోఁ
గూడికొనినవై దుర్భరము లగుచున్నవి. వధూవరులకు పరస్పరము
గాఢమైనట్టి యనురాగ ముదయింపనిచో వివాహతంత్రమును నడపి,

వారిని భగవంతుఁడే భార్యాభర్తలనుగ నేర్పఱచె నని చెప్పుట దైవ
దూషణచేయుట యని చెప్పుట కొంతయైన సందియము గలదా! జీవిత
ప్రయోజనములయందు పరస్పరసహానుభవము లేని వివాహములు దైవి
కములు గావు. అట్టివైవాహికబంధములయందు స్త్రీపురుషులు భార్యా
భర్తలై యుండునప్పటికిని వారియందు ప్రేమ యనువస్తువుయొక్క రేణువు
నైన, కంచుకాగడ వేసి వెదకినను మనము కనిపెట్ట జాలము.

సత్య మగుప్రేమను గలిగినవారందఱు నీశ్వరతుల్యమైన శాంత
మును గలిగియుండెదరు. వా రెల్లప్పుడు నుత్సాహపూరితులై నూత్న
యౌవనముతోఁ గూడియుండెదరు. ప్రేమవలననే ప్రేమ జనించును.
శ్రీరామచంద్రుఁడు ప్రేమయొక్క యవతార మని చెప్పఁదగును. అందు
చేతనే రాజ్యమునం దున్నజనులందఱు నాతనియెడల గాఢప్రేమాను
బద్ధులై యుండిరి. ఆతఁడు దుఃఖించిన, వారును దుఃఖింతురు. ఆతఁడు
సుఖించిన వారును సుఖింతురు. అరణ్యవాసియై పోఁబోవునపుడు
జను లాతని వెంబడించి చనుట కనేకవిధములఁ బ్రయత్నించిరి. కాని
యాతనికి వారియెడలఁ గలప్రేమయే వారిని రాకుండ నివారించినది.
జనులహృదయసీమలయం దెల్లెడల నాతఁడుసింహాసనము నధిష్ఠించియుం
డెను. ప్రేమకు జయింపరానివిషయ మెద్దియును లేదు. సూర్యాస్త
మయ మగుకొలఁదిని ఛాయ పెఱుఁగునటులనే, కష్టపరంపరలు సంభవ
మయినకొలఁది నది సదా పెఱుఁగుచునేయుండును. ప్రేమచేతనే బుద్ధ
దేవుఁడు లోకమును జయించి తనసత్యసిద్ధాంతమును స్థాపింపఁగలిగెను.
ప్రేమచేతనే క్రైస్తవమతము వ్యాపింపఁగలిగెను. మురళీగానమును
జేయుచు ప్రేమామృతమును వెల్లివిరియించుటచేతనే గోపాలకృష్ణుఁ
డొక్కబృందావనమునుమాత్రమే గాక యీయఖిలప్రపంచము సంతతము
ప్రేమాపూరితము నొనర్చివైచెను.

# *The Liberal Theology Prizes.*

## బ్రహ్మజ్ఞానపరీక్షాబహుమానములు.

శ్రీవీరేశలింగపుస్తకభాండారపక్షమున నీపైపేరునఁ బ్రతివత్సరమున నుత్తరసర్కారులలో నీపరీక్షలు జరుపఁబడుచుండును. కడచినవత్సరమున జరిగినపరీక్షకు వచ్చినవారిలో నీక్రిందివారలు బహుమానములను బడయ నర్హులైరని తెలియఁజేయ సంతసించుచున్నారము.

సీనియర్ గ్రేడు.

| | | | |
|---|---|---|---|
| 1. | ఏ. సుబ్బారావు. | గవర్నమెంటు కాలేజి | రాజమండ్రి. |
| 2. | పురాణపండ కామేశ్వరరావు. | పిఠాపురంరాజుగారి కాలేజి | కాకినాడ |
| 3. | ప్రయాగ వెంకటరత్నము. | గవర్నమెంటు కాలేజి | రాజమండ్రి. |
| 4. | చిలుకూరి వీరావధానులు. | ఏ. ఇ. ఎల్. ఎమ్. కాలేజి | గుంటూరు. |

జూనియర్ గ్రేడు.

| | | | |
|---|---|---|---|
| 1. | సి. హెచ్. నరసింహము. | ట్రెయినింగు స్కూలు | రాజమండ్రి. |
| 2. | ఐ. జానకిరామయ్య. | టైలర్ హై స్కూలు | నరసాపురము. |
| 3. | పి. రామచంద్రయ్య. | వీరేశలింగము హైస్కూలు | రాజమండ్రి. |
| 4. | టి. వి. కూర్మరావు. | రాజుగారి కాలేజి | పర్లాకిమిడి |
| 5. | యన్. సత్యనారాయణ. | పిఠాపురంరాజుగారి కాలేజి | కాకినాడ |
| 6. | యమ్. చిరంజీవరావు. | యస్. కే. పి. హై స్కూలు | బెజవాడ |
| | కే. వెంకటాద్రిమయ్య. | వీరేశలింగము హైస్కూలు | రాజమండ్రి. |

రాబోవు శ్రీవీరేశలింగపుస్తకభాండారముయొక్క పదుమూఁడవసంవత్సరోత్సవసమయమున నీబహుమానములొసంగఁబడును.

బ్రహ్మజ్ఞానపరీక్షాబహుమాన
కార్యనిర్వాహకసంఘము.
రాజమహేంద్రవరము.
15—7—1913.

జయంతి గంగన్న.
కార్యదర్శి.

# *P. Subbaroy, Ayurvedic Pharmacy.*

## *Sri Venkatesa Perumalkoil, Sannithy,* TANJORE.

దయచేసి దీనిని తమతమ స్నేహితులకు చదివి చూపండి.

లోకప్రసిద్ధమైన ధాతుపుష్టిమందు:—దీనియొక్క గుణము వ్రాయసాధ్యము కాదు. అనుభవమువల్ల తెలుసుకోవచ్చును. ధాతునష్టము, బలహీనము అజీర్ణము, కండ్లు, చేతులు కాళ్ళుమంటలు, వొళ్లుయెండకట్టడం, శీఘ్రస్ఖలితము, స్వప్నస్ఖలితము, చేతులు, కాళ్ళు, నడుము, మొదలయిన అవయముల బలహీనము, నొప్పులు, సోమరితనము, మేహమువల్ల వుష్ణము, పాండు యింకను అధికమయిన అసాధ్యవ్యాధులను పోగొట్టును. శరీర పుష్టి పురుషత్వము జీర్ణశక్తికలిగి ధాతుపుష్టినివృద్ధిచేయును. నీరయిపోయిన యింద్రియమును గట్టిపరచును. డబ్బీ 1 కి వెల రూ 2-0-0 వి. పి. శెలవు అణాలు 5 ప్రత్యేకము.

2. అగ్నిమాంద్యమునకు మందు:—పుల్లతేప్పులు, గొంతుమంటలు, మలబద్ధము కడుపునొప్పి, నోరుకంపు, అజీర్ణము, నిద్రలేకపోవుట, పిత్త వుపద్రవములను స్వస్థపరచును. అధికమయిన ఆకలిని, దేహారోగ్యమును కలుగజేయును. డబ్బి 1 కి వెల 0-8-0 వి. పి. శెలవు 1 డబ్బి మొదలు 2 డబ్బీలవరకు అణాలు 5 ప్రత్యేకము.

3. ప్రమేహనివారణి:—యేకారణమువల్లగాని దేహమునసంభవించిన కుష్టము మంటలు, నిద్రలోమంటలు, క్రిందరక్తముపడుట, మొదలగు భయంకర వ్యాధులకు స్త్రీ పురుషులకును వుపయోగ పరచవచ్చును. స్వస్తపరచును. దీనివెల సీసా 1కి 1-0-0 వి. పి. 1 సీసా మొదలు 6 సీసాలవరకు పంపుటకు అణాలు 5. ప్రత్యేకము.

4. లక్ష్మీకస్తూరిమాత్రలు;—తాంబూలము వేయువారు యెప్పుడును చేతులోనే వుంచుకొనవలసినది. ప్రసిద్ధమైన వస్తువు. పుప్పిపండ్లనొప్పి, నోరుకంపు, అజీర్ణము పిత్తవాయువు, కలరా, ప్లేగు, వీటిని పోగొట్టును తాంబూలములుగాని, వూరకగాని భోజనము అయినపిమ్మట 2 మాత్రలు వుపయోగపరచితే యేలాటిగొప్పభోజనమును తక్షణం జీర్ణముచేయును, గాన నోటిలో అనేక గంటలవరకు సుగంధవాసనయుండును ప్రతిదినం తెల్లవారి రెండుమాత్రలను తింటూవచ్చినయెడల బహుకాలముగావుండే అగ్ని

మాంద్యము, మలబద్ధము అజీర్ణమువల్ల కలిగెడు మలబద్ధము కడుపునొప్పి గొంతువాంటలు మొదలగు అనేకవ్యాధులను పోగొట్టును. ప్రసవకాలమందు తాంబూలముతో వుపయోగపరచు నెడల శీతలము దగ్గరజేర నేరదు. జన్నిగా వుండునపుడు ఈమాత్రను యిచ్చిన యెడల జన్ని పారిపోవును. ఇందులో లాహిరి మొదలగు అపాయకరమగు యేవస్తువు చేరలేదు. కాశ్మీర దేశములోనుండి నేరుగా రప్పించిన కస్తూరి, బంగారు రేకు పచ్చకర్పూరము మొదలగు పాముఖ్యదరలుగల అనేక మందుసామానులును వాసన ద్రవ్యములును జేర్చి చేయబడినవి. తాంబూలముతో వుపయోగపరచితే పచ్చకర్పూరము మొదలగు వాసనవస్తువులను చేర్చవలసిన అవశ్యకమే యుండదు. పసిబిడ్డలకు తాంబూల రసములో యిచ్చినయెడల మాంద్యము, దగ్గు జలుబు నివర్తియగును. సీసా 1కి వెల అ 4 ఇండియాలోకి సీసా 1 టి మొదలు 12 సీసాలవరకు పాకింగు తపాలు శెలవు అణాలు 5 ప్రత్యేకము.

1 సర్వనొప్పులసంహారి;—ఈతైలము కొంచము చరిమినయెడల చేతులు కాళ్ళు కీళ్ళనొప్పులు, ముణుకు, రొమ్మునొప్పి, తలనొప్పి, గొంతునొప్పి, పక్కనొప్పి, నడుమునొప్పి, నూతకనొప్పి, పార్శ్వవాయువు మొదలగు అనేకవిధములయిన నొప్పులను అతి శీఘ్రములో గుణపరమును సీసా 1 కి వెల రు 1 0 0. 1 టి మొదలు 3 సీసాలవరకు వి. పి. శెలవు అణాలు 5 ప్రత్యేకము.

2 సుగంధపరిమళ కేశ తైలము;—ఈతైలమువల్ల తల వెంట్రుకలు, మీసము కనురెప్పలు అతిబాగుగానున్ను నల్లగానును పెరుగును. కనులకు చల్లగాయుండును. సకలమయిన కండ్లనొప్పులును తలనొప్పులును తొలగించును. యెర్రవెంట్రుకలు నల్లనగును వెంట్రుకలు రాలకుండా పెరుగును. కన్నులకు ప్రకాశముయిచ్చును. వెల బుడ్డి 1 కి రు 0 8 0 వి. పి. శెలవు 2 సీసాలవరకు అణాలు 5 ప్రత్యేకము.

## పి. సుబ్బరాయి, ఆయుర్వేదౌషధశాల,

## శ్రీ వెంకటేశ పెరుమాళ్ళ సన్నిధి, తంజావూరు.

## పోస్టేజి సహా ఉచితము

# వీరవరరాజును మాలినియును

## ఒక విచిత్రమైనకథ

ఇయ్యది చదువుటచే మానసోల్లాసము కలుగఁజేయుటయే గాక,
ఆరోగ్యమునకు కావలసినస్వాభావికమైన కొన్నివిధులను గూడ తెలుపును.
కోరువారి కెల్లరకును ఉచితముగాఁ బంపఁబడును.
జాగుసేయక తక్షణమే వ్రాయుడు.


**వైద్యశాస్త్రి మణిశంకరగోవిందజీ,**

ఆతంకనిగ్రహఔషధాలయము,

22 బ్రాడ్వే 3 మదరాసు.